CMP Editorial File.




## విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది ముక్కుదిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాపహాయిగా, చక్కగా నిద్రపోతుంది.

విక్స్ వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయచ్చు.

ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది:

1. 

బయట-చర్మం మీద

2. 

లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది, హాయినిస్తుంది.
2. లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపొరబ్ మందుఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందుఆవిరి వంట్లో ప్రవేశించి. ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

### ప్రత్యేక గమనిక



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి.




SI6C A

## విక్స్ వేపొరబ్-జలుబుబాధలకి ఆధునిక ఔషధం

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

★

విడి ప్రతి
75 పైసలు

సంవత్సర చందా
రూ. 9/-












by

**THE NATIONAL TRADING CO.**

Manufacturers of

**KASHMIR SNOW BEAUTY AIDS**

BOMBAY-2. MADRAS-32.

---

# ప్రియమైనవి విద్యార్థులకు తలిదండ్రులకు కూడ!




## శ్వాన్

కేంబ్రిడ్జ మరియు ఆక్స్‌ఫర్డ్ పెన్లు




## శ్వాన్ సిరా

చక్కని వ్రాతకు అత్యంత ఆవశ్యకం !



**శ్వాన్ (ఇండియా) ప్రై. లి.**

పిల్లలను
ఆనందంతో
ఆరోగ్యంతో
వుంచడానికి...

# బ్రిటానియా గ్లూకోజ్

## మిల్క్ బిస్కట్లు

చురుకైన మీ పిల్లలకు కావలిసిన అదనపు పోషకత్వాన్ని కలిగించుటకు వారికి బ్రిటానియా గ్లూకోజ్ మిల్క్ బిస్కట్లను ఇవ్వండి. ప్రోటీన్లుచేర్చి ఎక్కువ పోషకవంతంగా చేయబడిన ఈ బిస్కట్లువారికి ఆనందాన్ని, మంచి ఆరోగ్యాన్ని కలుగ జేస్తాయి.




**బ్రిటానియా** అంటే నాణ్యత

BBC-8547

హోయ్ హోయ్ హోయ్

వచ్చింది న్యూట్రిన్ చెవలాయి
తెచ్చింది కమ్మని మిఠాయి

ఒక్కొక్క మిఠాయియందు ఫలరస పూరిత విందు




చెవలాయి, చెవలాయి
నాకు ఇవ్వవా
ఇంకో మిఠాయి?

చిన్ని చిన్ని చెవలాయి,
నిన్ను పుట్టించిందో
దెవ్వాయి,
ఇవ్వవా, దానికి పెట్టాలి
నీ చక్కని టాఫీ మిఠాయి




NCM-2 TEL


ఫిబ్రవరి
విడుదల!
విచిత్ర వినోదాత్మక
వింత కథ!
KE

# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల నుంచి "అమరవాణి" అనే శీర్షిక కింద ప్రసిద్ధమైన సంస్కృత శ్లోకాలు, తాత్పర్యసహితంగా పాఠకులకు అందిస్తున్నాము. వీటిలో గొప్ప సత్యం ఉంటుంది. అందుచేత కోరిన పాఠకులు వాటిని కంఠస్థం చేసుకోవచ్చు.

"నిర్భయుడు" [బేతాళ కథ] లో వింత మనస్తత్వంగల పాత్ర చిత్రీకరించబడింది.

"అనాకారి వధువు" అన్నది హాస్యకథ.

సంపుటి 46 జనవరి '70 సంచిక 1

CHITRA




# ఊహాసుందరి

శూరసేన నగరపు యువరాజు ప్రదీపుడు చాలా అందమైనవాడూ, బుద్ధిమంతుడూనూ. అతనిలో ఒకే లోపం ఉండేది. అదేమిటంటే, అతనికి ముక్కు మీద కోపం ఉండేది; అతి స్వల్పవిషయాలకు కూడా వ్యథచెందేవాడు.

ప్రదీపుడికి యుక్తవయసు వచ్చాక అతని కోసం చుట్టుపట్ల ఉన్న రాజకుమార్తెలందరి పటాలూ తెప్పించారు. అయితే అతనికి వారిలో ఏ ఒకరూ నచ్చలేదు. నిజానికి అతని మనసులో చాలాకాలంగా ఒక ఊహాసుందరి ఉన్నది. అలాటి కన్య దొరికేదాకా అతను పెళ్ళాడదలచలేదు.

ఏ రాజకుమార్తె చిత్తరువు చూసినా ప్రదీపుడు, "నేను పెళ్ళాడదలచిన కన్య ఇలా ఉండదు." అనేవాడు. అతను అస్తమానమూ ఇదే మాట అనటం వినీ, వినీ రాజుకు విసుగెత్తిపోయి, "నీకు కావలిసిన కన్యను నువే వెతుక్కో," అన్నాడు.

ప్రదీపుడు కొద్దిమంది పరివారాన్ని వెంటబెట్టుకుని దూర దేశాలకు ప్రయాణమయాడు. ఎన్నివందల యోజనాలో తిరిగినా అతనికి కావలిసిన కన్య ఏ రాజభవనంలోనూ కనిపించలేదు. ప్రాణం విసిగి అతను తిరుగు ప్రయాణమై వస్తుండగా ఒక గ్రామంలో ఒక సంత తగిలింది. సంతలో అనేక వినోదాలూ, వింతలూ ఉండేవి. వాటిని చూసి ఆనందించటానికి ప్రదీపుడు సంతకు వెళ్ళాడు. అక్కడ ఒక దుకాణంలో ఒక చిత్తరువు కనిపించింది. దాన్ని చూస్తూనే ప్రదీపుడు స్తంభించి నిలిచిపోయాడు. ఎందుకంటే ఆ చిత్తరువులో ఉన్న స్త్రీ ముమ్మూర్తులా అతని ఊహాసుందరే!

అతను దుకాణం వాణ్ణి, "ఈ బొమ్మ ఎవరిది? లేక ఇది ఊహాచిత్రమా?" అని అడిగాడు.

ఎస్. భాస్కరరావు

"ఇది కోటనగరపు రాజకుమార్తె చిత్తరువు. దక్షిణ దేశానికి వెళ్ళిన ఒక చిత్రకారుడు కోటసంస్థానానికి వెళ్ళి, అక్కడి రాజకుమార్తె బొమ్మ వేశాడట. అది తన కుమార్తె అంత అందంగా లేదని ఆ రాజు దాన్ని నిరాకరించాడట. బొమ్మ చక్కగా ఉన్నది; అందుకని నేనా చిత్రకారుడి దగ్గిర కొన్నాను," అన్నాడు దుకాణదారు.

ప్రదీపుడు ఆ చిత్తరువును దుకాణదారు చెప్పిన ధరకు కొని, సాధ్యమైనంత శీఘ్రంగా స్వదేశానికి తిరిగి వచ్చి, చిత్తరువును తన తండ్రికి చూపి, "ఈమె దక్షిణ దేశంలోని కోటనగర రాజకుమార్తె. ఈమెను నేను పెళ్ళాడ నిశ్చయించాను. మిగతా ఏర్పాట్లు మీరు చెయ్యండి," అన్నాడు.

రాజు తన ప్రధానమంత్రితో సంప్రతించాడు. కోటనగరం చాలా దూరాన ఉన్నది. అక్కడికి దూతను పంపి, పెళ్ళికి వారిని ఒప్పించి, ఆ వార్త వచ్చి చేరాక పెళ్లికి తరలి వెళ్ళాలంటె చాలా కాలయాపన అవుతుంది. అందుచేత రాజపురోహితుణ్ణి పంపి, రాయబారం సానుకూలమైతే, ప్రదీపుడి కత్తికీ కోటరాజకుమార్తెకూ పెళ్ళి చేసి, ఆమెను తెచ్చేటట్టు ఏర్పాటు జరిగింది. రాజపురోహితుడు



ప్రదీపుడి చిత్తరువును తీసుకుని కోటనగరానికి వెళ్ళాడు. కోట రాజూ, ఆయన కుమార్తె మంగళా కూడా పెళ్ళికి సంతోషంగా సమ్మతించారు. కత్తికి పెళ్ళి జరిగింది. కోటరాజు తన కుమార్తెను పెద్ద సారెతోనూ, పరివారంతోనూ అత్తవారింటికి సాగనంపాడు. మంగళ తన చెలికత్తెలతోనూ, భటులతోనూ అక్కడక్కడా మజిలీలు చేసుకుంటూ శూరసేననగరం చేరవచ్చింది.

ఈ లోపల ప్రదీపుడికి తన ఊహాసుందరిని కళ్ళ చూడాలన్న తహతహ జాస్తిగా ఉన్నది. అతను సాధారణ దుస్తులు ధరించి



తమ నగరానికి కొద్ది దూరంలో మంగళ మజిలీ చేసిన చోటికి వెళ్ళాడు. గుడారాల మధ్యగా చెలికత్తెలు తిరుగుతున్నారు.

ప్రదీపుడు ఒక భటుణ్ణి సమీపించి, "ఏమోయ్, రాజకుమార్తె ఏ గుడారంలో ఉంటుంది? ఆమెను చూడవచ్చునా?" అని అడిగాడు.

ఆ భటుడు ఆకతాయితనానికి, "ఎందుకు చూడరాదూ? అదుగో ఆ గుడారంలో నుంచి వస్తున్నదే రాజకుమార్తె మంగళాదేవి!" అని ఒక చెలికత్తెను చూపాడు.

తక్షణమే ప్రదీపుడికి పట్టరాని కోపమూ, విరక్తీ వచ్చేశాయి. తనను మోసగించి, ఎవతెనో తనకు అంట గట్టేశారు. కాని ఇప్పుడు తాను చేయగలది ఏమీ లేదు—తన ఊహాసుందరి తనకు దక్కలేదని కుమిలి పోవటం తప్ప.

ప్రదీపుడు రాజభవనానికి తిరిగి వచ్చి, ఎలాటి పరిస్థితులలోనూ పగటి వేళ తన భార్య తన కంట పడకుండానూ, రాత్రి వేళ తన శయనమందిరం లోపల గాని, వెలపలగాని దీపాలు వెలిగించరాదనీ కఠిన మైన ఉత్తరువులు చేశాడు.

యువరాజు ఇలాంటి ఉత్తరువులు ఎందుకు చేశాడో ఎవరికీ అర్థంకాలేదు. అయితే అతను తన భార్యను వరించి చేసుకున్నాడు గనక ఎవరూ ఆందోళన చెంద లేదు. కాని మంగళ మటుకు చాలా ఆందోళన పడింది. తాను చిత్తరువులో చూసిన వాణ్ణి కాకుండా మరొక మనిషికి తనను పెళ్ళిచేశారేమో ననీ, అందుకే తన భర్త తన కంట పడకుండా ఉండటానికి ప్రయత్నిస్తున్నాడేమో ననీ ఆమెకు శంక కూడా కలిగింది. అయితే, ఆమె తన భర్త కంట పడకుండా, చాటున ఉండి అతన్ని చూడ గలిగింది. అంతటితో ఆమె భయం తీరి పోయిందిగాని, ఆశ్చర్యం అలాగే ఉండి పోయింది.

ప్రదీపుడు రాత్రిపూట కటిక చీకట్లో తన శయనమందిరం ప్రవేశించేవాడు; మంగళ మాట్లాడిస్తే ముక్తసరిగా సమాధానం ఇచ్చే వాడు. తెల్లవారుగట్ల కటిక చీకటిలోనే బయటికి వెళ్ళిపోయి మళ్ళీ రాత్రి పొద్దుపోయిన దాకా మంగళ ఉన్న చాయలకు వచ్చే వాడు కాడు.

రోజురోజూ ఇలా జరుగుతూంటే మంగళ భరించలేక పోయింది. తన భర్త ప్రవర్తనకు కారణం ఏమిటో తెలుసుకునే దాకా ఆమె మనసు ముళ్ళ మీద ఉన్నట్టు అనిపించింది. అందుచేత ఆమె తన వెంట ఉన్న ముసలిదాసిని సలహా అడిగింది.

"తల్లీ, నీ అందం కోసమే నిన్ను పెళ్ళి చేసుకున్నాడని ఇక్కడివాళ్ళు చాలాసార్లు చెప్పారు. అది నిజం కాదేమో మరి. నిజమైతే నీ ముఖం చూడకుండా ఉండటానికి ఇన్ని పాట్లు పడతాడా? అతను పగలల్లా గోశాల వద్ద ఉంటున్నట్టు తెలిసింది. పొరపాటున నువు కనిపిస్తావని భయం కాకపోతే, యువరాజైన వాడికి రోజూ పశువుల మందల మధ్య ఏం పని? నిన్ను చూస్తే అతను ఏం చేస్తాడో తెలుసుకోవటం అవసరం. అందుకు ఒక పని చేద్దాం. నువు సామాన్య దుస్తులు ధరించి, అలంకరణలు లేకుండా నా వెంట రా. పశువులమంద





"బాబూ, ఈ పిల్లది నా మనవరాలు. వైద్యులు ఉష్ణధారలు తాగించమన్నారు. తమ సెలవైతే—" అన్నది. ఆమె మాట పూర్తిచెయ్యలేదు. ప్రదీపుడు మంగళ కేసి కళ్ళు పెద్దవి చేసి చూస్తున్నాడు. అతని ముఖం వెలవెలాబోతున్నది. తన ఊహా సుందరి ఈ ముసలిదాని మనమరాలా! అతను తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు.

"ఏం బాబూ?" అని ముసలిది మళ్లీ అడిగినదాకా రాజకుమారుడు ఈ ప్రపంచంలో లేడు.

"ఉష్ణధారలా? తాగించు, తాగించు!" అన్నాడు ప్రదీపుడు తడబడుతూ.

మంగళ ఒక ఆవును పాలుపితుకుతున్న చోటికి బయలుదేరి కెవ్వున అరిచింది. ఆమె కాలిలో ముల్లు గుచ్చుకున్నది.

"ఏమయింది?" అని ప్రదీపుడు ఆందోళన పడుతూ వచ్చాడు. తన ఊహా సుందరి కాలిలో ముల్లు విరిగిందని వినగానే అతని కళ్ళు చప్పున చెమ్మగిల్లాయి.

"నన్ను పట్టుకు నిలబడు!" అని మంగళను హెచ్చరించి, ప్రదీపుడు ఆమె కాలిలో గుచ్చుకున్న ముల్లును తానే స్వయంగా తీశాడు.

లుండే చోటికి పోదాం. నిన్ను చూడగానే నీ భర్త ఏం చేస్తాడో జాగ్రత్తగా గమనించు. దానితో అతని రహస్యం తెలిసిపోవచ్చు," అన్నది ముసలిదాసి.

మర్నాడు తెల్లవారుఝామున, ప్రదీపుడు శయనమందిరంలో నుంచి వెళ్ళిపోయాక, రాజభవనం ఇంకా మాటుమణిగి ఉండగానే, మంగళ ఒక పాత చీర కట్టుకుని, ఆభరణాలు పెట్టుకోకుండా, తల అయినా దువ్వుకోకుండా, తన దాసి వెంట రాజుగారి గోశాల లున్న చోటికి బయలుదేరి వెళ్లింది.

అప్పటికే ప్రదీపుడు అక్కడికి చేరాడు. ముసలిది తిన్నగా అతనున్న చోటికి వెళ్ళి,

పాలు పితికేవాడి చేత మంగళ నాలుగు ధారలు నోట్లో పిండించుకుని, "వస్తాను. సెలవిప్పించండి," అన్నది ప్రదీపుడితో.

"రోజూ వస్తావుగదా? ఈ వైద్యం నలభైరోజులు చెయ్యాలంటారు," అన్నాడు ప్రదీపుడు. అతని గొంతులో అంతులేని ప్రేమ తొణికిసలాడింది.

మంగళ నవ్వి, "వస్తాను," అంటూ ముసలిదాని వెంట బయలుదేరి, ఎవరూ చూడకుండా, పక్క వాకిలి కుండా రాజ భవనం ప్రవేశించింది.

ఆ రాత్రి ప్రదీపుడు పడకగదిలో గాఢాంధకారంలో నిద్ర పోతూండగా మంగళ అతన్ని లేపింది.

"ఏమిటి? ఏం కావాలి?" అన్నాడతను చిరాకుగా.

"అరికాలు బాధ పెట్టుతున్నది. పొద్దున ఏదో గుచ్చుకున్నది. దాని మూలంగా పాదం వాచినట్టున్నది," అన్నది మంగళ.

చేసేది లేక ప్రదీపుడు నౌకర్లను కేక పెట్టి దీపం తెమ్మన్నాడు. దీపం వచ్చింది. అతను ఆమె చూపిన పాదాన్ని చూసి, "వాపు ఉన్నట్టు లేదే!" అన్నాడు.

"వాపూ లేదు, నొప్పీ లేదు. మీ ముఖం చూద్దామని దొంగ ఎత్తు వేశాను," అన్నది మంగళ నవ్వుతూ.

అప్పుడతను దీపం కాంతిలో ఆమె ముఖాన్ని తల ఎత్తి చూశాడు. తన ఊహా సుందరి! అతనికి ఆనందంతో మూర్ఛ వచ్చినంత పని అయింది.

మర్నాటినుంచీ యువరాజుగారు పగలల్లా అంతఃపురం నుంచి కదిలేవాడు కాడు. అతని శయనమందిరం దీపాలతో దేదీప్యమానంగా వెలిగి పోతూం డేది. దాని ముందున్న నడవలలో అడుగడుగునా దీపాలు వెలుగుతూండేవి.

యువరాజులో వచ్చిన ఈ మార్పు కూడా ఎవరికీ అర్థం కాలేదు.






జ్ఞాతిభి ర్వంచ్యతే నైవ, చోరేణాపి ననీయతే,
దానేన నక్షయం యాతి; విద్యారత్నం మహాధనం. 1.

విద్య పెన్నిధి వంటిది. దానిని జ్ఞాతులు పంచించి తినుకోలేరు. దొంగలు ఎత్తుకు పోలేరు. దానం చెయ్యటం వల్ల అది తరగదు.

పుస్తకేషుచ యావిద్యా పరహస్తేచ యద్ధనం
సమయేతు పరిప్రాప్తే నసా విద్యా, నత ద్ధనం. 2.

పుస్తకాలలో మాత్రమే ఉన్న విద్యా, పరుల వద్ద ఉన్న ధనమూ సమయానికి ఉపయోగపడవు గనక ఆ విద్య విద్యకాదు, ఆ ధనము ధనమూ కాదు.

సుఖార్థీ త్యజతే విద్యాం, విద్యార్థీ త్యజతే సుఖం;
సుఖార్థినః కుతో విద్యా, కుతో విద్యార్థినః సుఖం ? 3.

సుఖం కోరినవాడు విద్యను వదులుకుంటాడు, విద్యకోరినవాడు సుఖాన్ని వదులుకుంటాడు. సుఖం కోరేవాడికి విద్యా, విద్య కోరేవాడికి సుఖమూ ఎక్కడ లభిస్తుంది?

విద్వత్త్వంచ నృపత్వంచ నైవతుల్యం కదాచన;
స్వదేశే పూజ్యతే రాజా, విద్వాన్ సర్వత్ర పూజ్యతే. 4.

విద్వత్తూ, రాచరికమూ ఎన్నడూ పోల్చదగినవి కావు. రాజుకు దేశంలోనే గౌరవం ఉంటుంది. కాని విద్వాంసుడికి అంతటా గౌరవం ఉంటుంది.



# శిథిలాలయం

## 25

[శిఖిముఖిని కాళికాదేవికి బలిచేయబోయే సమయంలో, ఐభ్యులకులపెద్ద, అతడి మెడలోని కాళీమాత రూపంగల రక్షరేకు చూసి ఆశ్చర్యపోయాడు. తరవాత సంగతి తెలుసుకుని, పూజారిని దేవికి బలిపెట్టమన్నాడు. కాని, పూజారి కొండ మీదికి పారిపోయాడు. ఐభ్యులు అతణ్ణి పట్టుకునేందుకు కొండ మీదికి పరిగెత్తసాగారు. తరవాత—]

తనను పట్టుకునేందుకు వచ్చే ఐభ్యులను చూసి పూజారి ఏమీ తొణక్కుండా, శిరస్త్రాణంలో నుంచి ఒక పొడవాటి తాళపత్రం బయిటికి తీసి, దాన్ని శిఖిముఖీ, విక్రమకేసరుల కేసి ఊపుతూ నిలబడ్డాడు. విక్రమకేసరి తన దుస్తుల్లో తాళపత్రం కోసం వెతికాడు. అది అక్కడ లేదు.

"శిఖీ! వాడు మన కేసి చూపుతున్న తాళపత్రం ఏమిటో తెలుసా? దాని మీదే శిథిలాలయానికి వెళ్ళే దారి మార్గానికి సంబంధించిన వివరాలన్నీ వున్నవి. కాళికాదేవి గుడిలో జరిగిన గొడవలో అది, నా దుస్తుల్లో నుంచి కింద పడివుంటుంది. దాన్ని ఆ దుర్మార్గుడు దొరక పుచ్చుకున్నాడు," అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి ఓ క్షణం నిస్పృహలో మునిగిపోయి, అంతలోనే తెప్పరిల్లి, "జరిగిందానికి విచారించి లాభం లేదు. ఇప్పుడు



ఆ శిథిలాలయం చేరటానికి వున్న ఉపాయం ఒకటే. మనం ఆ పూజారిగాణ్ణి వెన్నంటి పోవటం, వీలైతే పట్టుకోవటం," అన్నాడు.

వీళ్లిద్దరి సంభాషణా విన్న ఇభ్యుల కుల పెద్ద, వాళ్ళకు ధైర్యం చెబుతూ, "విచారించకండి. ఆ శిథిలాలయం వున్న లంకకు వెళ్ళ దలిస్తే, అందుకు మీకు సహాయ పడేందుకు అవసరం అయినవాళ్ళు ఒకరిద్దరు, మా జాతివాళ్ళలో వున్నారు. మా దళనాయకుడు నాంగ్‌సోమ్ చిన్నతనంలో తండ్రి వెంట ఆ లంక సమీపానికి వెళ్లి వచ్చాడు. అతడు మీకు దారి చూపగలడు. కాని, నా సలహా...." అంటూ ఆగిపోయాడు.



"ఇభ్యనాయకా, మీ సలహా ఏదో చెప్పండి, వింటాం!" అన్నాడు శిఖిముఖి.

"ఆ లంకను దూరాన వుండి చూసిన వాళ్ళున్నారు తప్ప, నా ఎరుకలో దాని మీదికి పోయి, ఆ శిథిలాలయాన్ని చూసిన వాళ్ళు మాత్రం లేరు. ఆ లంక చాలా భయంకరమైనది. కొండ చేంతాడంత పాములూ, రాక్షసి తేళ్ళూ ఆ లంక నిండా వున్నవని మా వాళ్ళు చెప్పుకుంటారు. దాని పేరే వృశ్చికలంక! ఇంతకూ మీ రా లంకకు వెళ్ళవలసిన అవసరం ఏమిటి?" అని ప్రశ్నించాడు ఇభ్యకులపెద్ద.

ఈ ప్రశ్న చాలా సబబైనదిగా శిఖిముఖికి తోచింది. తాత విక్రమకేసరి సజీవుడేమో అన్న అనుమానంతో తాము బయలుదేరారు. ఆయన చాలా కాలం కిందటే మరణించినట్టు తెలిసిపోయింది. ఇక యిప్పుడు శిథిలాలయాన్ని చూడబోయే ప్రయత్నంలో అనవసరమైన యిక్కట్లు తెచ్చుకోవటం ఎందుకు?

శిఖిముఖి తన అభిప్రాయం విక్రమకేసరికి చెప్పాడు. విక్రమకేసరి ఓ క్షణం ఆలోచించి, "శిఖీ! మా తాతగారు చూడ దలిచి విఫలుడైన ఆ శిథిలాలయాన్ని నేను చూడాలనుకుంటున్నాను. మా తాతగారు





అక్కడ దొరికే బంగారాన్నే కాక, అపూర్వ మైన శిల్ప కళాఖండాలను కూడా మా రాజధానికి తేవాలనుకున్నారు. ఆ పని సాధ్యమైతే నేను చేసి, ఆయన ఆత్మకు శాంతి కలిగించాలని వున్నది," అన్నాడు.

"అలా అయితే నేనూ నీ తోటివాణ్ణే. మన కిన్ని యిక్కట్లు కలిగించిన ఆ పూజారి దుర్మార్గుడి అంతం ఒకటి చూడాలి. అంతే కాక....నాగుమల్లి వాడి శిఖ తరిగి తెమ్మ న్నది. అది లేకుండా నేను మళ్లీ ఆవిడ ముఖం ఎలా చూ సే ది ?" అన్నాడు శిఖిముఖి.

ఆ మాటలకు విక్రమకేసరి చిరునవ్వు నవ్వి, "ఇంకేం, ఆ శిథిలాలయం ఎక్క డున్నదో వెతుక్కుంటూ వెళ్ళేందుకు మన ఇద్దరికీ అవసరం అయిన కారణం, ప్రోత్సాహం కూడా వున్నది. ఆ పూజారి మనకు ఆ శిథిలాలయం దగ్గిరగాని దొర కడు," అన్నాడు.

"అంత దూరం ఎందుకు, మా వాళ్ళు యిప్పుడే ఆ వెధవను పట్టుకుని కాళ్లూ చేతులూ కట్టి మనదగ్గిరకు తీసుకువస్తారు," అన్నాడు ఇభ్యకులపెద్ద.

కులపెద్ద మాటముగించే లోపలే, పూజారి వెనక నుంచి నవరభేరుండం హఠాత్తుగా




ముందుకు వచ్చి, అక్కడున్న ఒక పెద్ద బండను పైకెత్తి పట్టుకుని, "ఈ భేరుండం పక్కనుండగా పూజారి దొరను ఎవరూ పట్టుకోలేరు. కావాలంటే యీ కొండనే దొర్లించేయగలను !" అంటూ కొండ ఎక్కి వస్తున్న ఇభ్యుల కేసి బండను విసిరాడు.

తమ మీదికి దొర్లి వస్తున్న రాతిబండను తప్పుకుని ఇభ్యులు మరింత బిగ్గరగా అరుస్తూ కొండ ఎక్కసాగారు. పూజారి తాళపత్రాన్ని శిరస్త్రాణంలో దాచి, తన అనుచరుల కేసి తిరిగి, "చూస్తా రేం, అందరూ బండరాళ్ళను ఆ చవట వెధవల మీదికి ఒకేసారి దొర్లించి, బిలం ప్రవే



శించండి," అని కొంచెం ముందుకు వచ్చి, శిఖిముఖి వాళ్ళతో, "ప్రాణాలమీద ఆశ లేకపోతే, మీరంతా వృశ్చికలంకకు రండి! అక్కడ మహా శిథిలేశ్వరికి మిమ్మల్ని బలి పెట్టి, యీ బ్రహ్మపుత్రా లోయల్లో ఒక ఐభ్య మహాసామ్రాజ్యాన్ని స్థాపించి, చక్ర వర్తి నవుతాను," అంటూ పెద్ద గొంతుతో అరిచాడు.

"చూస్తున్నారు గదా, వాడు పట్టి వాచా లుడు! మా వాళ్ళు వాణ్ణి తప్పకుండా బంధిస్తారు," అన్నాడు ఐభ్యకులపెద్ద.

శిఖిముఖి, విక్రమకేసరులకు మాత్రం పూజారి ఒక పట్టాన దొరుకుతాడన్న నమ్మకం లేదు. వాళ్ళు అజిత వీరభద్రుల్ని హెచ్చ రించి త్వరత్వరగా కొండ మీదికి పోయారు. వాళ్లు వెళ్లేసరికి అక్కడ కొందరు ఐభ్యులు నిలబడి, నీటితో నిండివున్న ఒక బిల మార్గం కేసి చూస్తున్నారు. పూజారిముఠా ఆ బిలంలో ప్రవేశించి, పక్కనేవున్న చిన్న కొలనులోని నీరు అందులో ప్రవేశించేలా రాళ్ళను తొలగించారు.

"వీడు మహా జిత్తులమారి! పారిపోవ టానికి ముందుగా మార్గం చూసుకునే మనతో అంతసేపు మాటలు పెట్టుకున్నాడు," అన్నా డొక ఐభ్యుడు.

"వాడి జిత్తుల సంగతి మీ కన్న మాకు బాగా తెలుసు. మీరు యిక్కడ కాలం వృథా చెయ్యక, కొండ మీద అన్ని వైపు లకూ పోయి, వాడు తన ముఠాతో ఏ బిలం నుంచి బయటపడతాడో కనిపెట్టండి. ఆ తరవాత ఒకళ్ళిద్దరు వెనగ్గా అనుసరించి పోయి, వా డెళ్ళే మార్గం ఏదో మాకు వార్త పంపండి," అన్నాడు విక్రమకేసరి.

ఐభ్యులు కొండ మీద అన్ని వైపులకూ పరిగెత్తారు. శిఖిముఖీ, విక్రమకేసరులు తమ అనుచరు లిద్దరితో కొండ దిగివచ్చి, అక్కడ తాము చూసిందంతా ఐభ్యుల నాయకుడికి చెప్పారు.




"అయితే, ప్రస్తుతానికి వాడు మన నుంచి ప్రాణాలతో పారిపోయినట్టే. శిథిలాలయం చేరటానికి వాడికి దగ్గిరవున్న తాళపత్రం సాయపడుతుంది. మరి మీ సంగతేమిటి? మీరు అక్కడికి వెళ్ళాలనే పట్టుదలలోనే వున్నారా?" అని అడిగాడు ఇభ్యుల నాయకుడు.

"ఆ దారి తెలిసిన నాంగ్‌సోమ్ అనే మీ దళనాయకుణ్ణి మాకు సాయం యిస్తే, మేము తప్పక బయలుదేరి పోతాం. మాకు ఆ ఆలయంలో వున్న ధనకనకాల మీద ఎలాంటి ఆశా లేదు. ఏవైనా గొప్ప శిల్పాలు వుంటే వెంట తెచ్చేందుకు ప్రయత్నిస్తాం.



అన్నిటికన్నా మాకు ముఖ్యం; మా పూర్వ మహారాజు విక్రమకేసరి నెరవేరని కోర్కెను, నెరవేర్చి ఆయన ఆత్మకు శాంతి కలిగించటం," అన్నాడు శిఖిముఖి.

"ఆ మహారాజు సమాధి చూద్దురుగాని రండి. వృశ్చికలంకకు వెళ్ళటానికి అవసరం అయిన పడవలూ వాటి సంగతి తీరిగ్గా రాత్రికి మాట్లాడుకోవచ్చు," అని ఇభ్యుతుల నాయకుడు, శిఖిముఖీ వాళ్ళను తన పూర్వులు సమాధి అయిన చోటుకు తీసుకుపోయాడు.

ఒక విశాలమైన ప్రాంగణంలో, ఎత్తుగా నిర్మించిన పదీ పన్నెండు సమాధులు శిఖిముఖీవాళ్ళు చూశారు. ప్రతి సమాధి మీదా వింత వింత ఆకారాలు గల బొమ్మలు చెక్కబడి వున్నవి. వాటిల్లో కొంచెం పెద్దదిగా వున్న ఒక సమాధి దగ్గిరకు ఇభ్యు నాయకుడు పోయి, భక్తితో నమస్కరించి, "విక్రమా! యిదే మీ తాతగారైన విక్రమ కేసరి మహారాజు సమాధి. మా ఇభ్యుశిల్పి తనకు చాతనైనంతలో ఆయన రూపం సమాధి మీద చెక్కాడు. ఆయన రూపం నీకు బాగా గుర్తున్నదా?" అని అడిగాడు.

విక్రమకేసరి సమాధిపై నున్న తన తాతగారి రూపశిల్పం కేసి కొంచెం సేపు



పరీక్షగా చూసి, "సందేహం లేదు, ఇందులో మా తాతగారి ముఖలక్షణాలన్నీ వున్నవి. అయిన్ని నేను చాలా చిన్న వయసులో చూసివున్నా, ఆ ముఖం నాకు బాగా గుర్తే!" అన్నాడు.

ఇభ్య నాయకుడు చెప్పగా ఒకడు పరుగు పరుగున పోయి, రెండు పుష్ప మాలలు తెచ్చాడు. విక్రమకేసరీ, శిఖిముఖీ ఆ మాలలను సమాధి మీద వేసి నమస్కరించారు. ఆ తరవాత అందరూ తిరిగి గ్రామ మధ్యంలో వున్న చుట్టు గుడిశెకు వచ్చారు. గుడిశె దగ్గిర ఎర్రగండు శిఖిముఖికి ఎదురై, చిన్నగా మొరుగుతూ అతడి చుట్టూ గిరికీలు కొట్టసాగింది. శిఖిముఖి దాని తలను ఆప్యాయంగా నిమిరాడు.

అందరూ మధ్యాహ్న భోజనాలు ముగించి మాట్లాడుకుంటూ విశ్రాంతిగా కూర్చున్న సమయంలో ఇద్దరు ఇభ్యులు వచ్చి పూజారి అయిపూ అజా లేకుండా ఎటో పోయాడనీ, తామూ మరి కొందరూ కొండ ప్రాంతాలనే కాక, నదీతీరాన్ని కూడా వెతికామనీ తమ కులపెద్దకు చెప్పారు.

"వాడు ఆ కొండల్లోనే ఎక్కడో ఏదో బిలాన్నొకదాన్ని ఎంచుకుని అక్కడే గబ్బిలంలా దాగి వుంటాడు. చీకటి పడితే



గాని వాడు బైటికి రాడు.. కాపలా వేయండి," అన్నాడు ఇభ్యనాయకుడు.

ఆ రాత్రి ఇభ్యనాయకుడు మరికొందరు ఇభ్య ముఖ్యులతో సంప్రతించి, రెండు పడవలు అవసరం కాగలవని నిర్ణయించారు. అందులో ఒకటి శిఖిముఖీ అతడి అనుచరులూ ప్రయాణించేందుకూ, రెండవది శిథిలాలయంలో ఏవైనా అమూల్యవస్తువులు దొరికితే వాటిని తెచ్చేందుకూ ఉపయోగపడగలదని తేల్చారు. పోతే ఆ రెండు పడవలకు వెనకగా మరొక పెద్ద పడవలో కొందరు ఇభ్యులను వాళ్ళకు రక్షణగా పంపగల నన్నాడు ఇభ్యనాయకుడు.



ఆ మర్నాటి ఉదయం ఇఖ్యులు నదిలో వున్న పెద్ద పడవల్లో మూడింటికి కొత్తగా ఖడ్గమృగచర్మం తాపడం చేసి మధ్యాహ్నం వేళకు వాటిని ప్రయాణానికి సిద్ధం చేశారు. శిఖిముఖీ, విక్రమకేసరీ, అజితుడూ ఒక పడవలోనూ, దళనాయకుడు నాంగ్‌సోమ్, వీరభద్రుడూ మరొక పడవలోనూ ఎక్కారు. నాంగ్‌సోమ్ వున్న పడవలో నెల రోజులకు సరిపడా ఆహారపదార్థాలు నిలవచేశారు.

నాంగ్‌సోమ్ వున్న పడవ ముందు దారి చూపుతూండగా, రెండు పడవలూ నది దిగువకు బయలుదేరినై. మరొక పెద్ద పడవలో మరికొందరు ఇఖ్యులు కొంచెం వెనగ్గా ప్రయాణమయారు. ముందు బయలుదేరిన పడవలు రెండూ నది దిగువకు రెండు మూడు కోసులు ప్రయాణం చేసిం తరవాత, ఉత్తరం వైపు నుంచి వచ్చి నదిలో కలిసే ఒక పాయ వెంట ఎగువకు కొంతదూరం ప్రయాణించి, సరస్సులా కంటిచూపు అనేంతవరకూ జలమయంగా వున్న ప్రదేశాన్ని చేరారు. వాళ్ళకు అందులో కొన్ని లంకలూ, వాటి మీద ఎత్తయిన వృక్షాలూ, ఎగిరే నీటిపక్షులూ కనిపించినై.

నాంగ్‌సోమ్‌కు ఆ ప్రాంతమంతా బాగా పరిచయమైనదే. అతడు అనేకసార్లు మరి కొందరు తన జాతివాళ్ళతో కలిసి, చేపల వేటకు అటుకేసి వచ్చాడు. ఆ జలమయ ప్రదేశంలో పెద్దపెద్ద చేపలేకాక, భయంకర మైన వింత జలచరాలు కూడా వుండటం అతడికి తెలుసు. వృశ్చికలంక చేరే ముందు, చిన్నా పెద్ద లంకలను అనేకం దాటి పోవలసి వుంది.

తెడ్లు వేసి అతి జాగ్రత్తగా పడవలు నడుపుతున్నవాళ్ళకు, నీటిలో తమ చుట్టూ కదిలే పెద్దపెద్ద మొసళ్ళూ, తిమింగిలం లాటి ఆకారాలుగల కొన్ని చేపలూ కంట బడినై. అవి పడవల్ని అనుసరించి ఈదుతూ వస్తున్నవి. —(ఇంకా వుంది)






# నిర్భయుడు

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ దీక్ష చాలా గొప్పదే గాని, అది ఎప్పటికీ చెడకుండా అలాగే ఉంటుందనుకోకు. భయమన్నది ఏమిటో తెలియని ప్రగల్భుడు సైతం అతిస్వల్ప కారణానికి భయపడి పోయాడు. శ్రమ తెలియకుండా నీకు ప్రగల్భుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

గిరివ్రజపురంలో ఒక శ్రీమంతుడి కొడుకు ప్రగల్భుడు. బాల్యంలో కూడా అతనికి భయమంటే ఏమిటో తెలిసేది కాదు. పెద్దవాడైతే భయం అదే తెలిసి వస్తుందనుకున్నారు. కాని వాడు పెరిగి పెద్దవాడయే కొద్దీ వాడికి అపాయాలంటే మరింత నిర్లక్ష్యం

## బేతాళ కథలు



ఏర్పడింది. పొద్దున లేచింది మొదలు వాడు అన్నీ సాహసాలే చేసేవాడు. అటు వంటి పనులు చెయ్యటానికి భయం లేదా అని ఎవరన్నా అడిగితే, "భయమంటే ఏమిటి?" అని ఎదురు ప్రశ్న వేసేవాడు.

ప్రగల్భుడి తల్లిదండ్రులు తమ కొడుకు గురించి చాలా భయపడేవారు. అపాయ మంటే భయంలేనివాడు ఎప్పుడన్నా అపా యానికి గురికావచ్చు. ప్రగల్భుణ్ణి గురించి ఏం చెయ్యాలో వారికి పాలుబోక, తెలిసిన వారిని సలహా అడిగేవారు.

ఒకసారి ఒక వృద్ధుడు వారితో, "మీరు మీ కుమారుణ్ణి గురించి అనవసరంగా బెంగ పడకండి. మీ బెంగ మూలంగా వాడు మారడు. వాడికి వచ్చే ఆపదలను మీ బెంగ తప్పించలేదు. ఎప్పుడో వాడికి భయమంటే ఏమిటో తెలిసి వస్తుంది. ఆ తరవాత వాడు అందరిలాగే జాగ్రత్తగా మసులుకుంటాడు," అని చెప్పాడు.

యుక్తవయస్కుడయాక ప్రగల్భుడికి దేశాటన చెయ్యా లనిపించింది. ప్రపంచంలో ఎన్నో ప్రమాదాలున్నాయి. వాటన్నిటినీ ఎదుర్కోవాలని వాడి అభిలాష. తానున్న గిరివ్రజపురంలో చేయదగిన సాహసాలన్నీ అతను అదివరకే చేశాడు. అందుచేత అతను తండ్రి అనుమతి పొంది, ఒక సేవకుణ్ణి వెంటబెట్టుకుని దేశాల మీద బయలుదేరాడు.

వాళ్ళు చాలా గ్రామాలు చూశారు. సాహసకృత్యాలు చేసే అవకాశం ఏది వచ్చినా ప్రగల్భుడు వదిలిపెట్టలేదు. అతని పేరు అన్నివైపులా మారుమోగింది.

ఇలా దేశాటన చేస్తూ కొంత కాలానికి వారొక పెద్ద నగరం చేరారు. అది ఒక వర్తక కేంద్రమూ, పుణ్యక్షేత్రమూ కూడానూ. ప్రగల్భుడు చేరిన సమయానికి నగరమంతా యాత్రికులతోనూ, వర్తకులతోనూ కిక్కిరిసి ఉన్నది. ప్రగల్భుడికి

బస దొరకలేదు. నగరం చివర ఒక పెద్ద భవంతి ఉన్నదనీ, ఇల్లుగలవారు దానిని పాడుపెట్టి, నగరం మధ్యలో తమకు గల మరొక భవంతిలో ఉంటున్నారనీ తెలిసింది.

ప్రగల్భుడు నగరం మధ్యలో ఉంటున్న ఇంటికి వెళ్ళాడు. పాడుపెట్టిన ఇంటి యజమాని చనిపోయాడు. ఆయన భార్య తన కుమార్తెతో సహా ఉంటున్నది.

"అమ్మా, నే నీ ఊళ్లో కొంతకాలం ఉందామని దూరదేశం నుంచి వచ్చాను. నగరం వెలపల మీ ఇల్లు పాడుపెట్టి ఉన్న దని విన్నాను. నాలుగు రోజులపాటు నేను అందులో ఉండటానికి అనుమతించ గలరా?" అని ప్రగల్భుడు ఇల్లుగలావిడను వేడుకున్నాడు.

"నీ యిష్టం వచ్చినంతకాలం ఉండు, నాయనా. ఆ ఇంట్లో ఉండటానికి ఎవరూ ఒప్పుకోకుండా ఉన్నారు. నీకు అభ్యంతరం లేకపోతే నాకూ లేదు," అన్నది ఇల్లుగలావిడ.

వెంటనే ప్రగల్భుడు తన సేవకుణ్ణి వెంటబెట్టుకుని పాడుపడిన ఇంటికి వెళ్ళి, ఇల్లు బాగుచేయించి, ఆ రాత్రికి వంట చేయించుకుని తిని, నిశ్చింతగా పడుకుని నిద్రపోయాడు.



ఒక రాత్రివేళ ప్రగల్భుడు మేలుకున్నాడు. కప్పు నుంచి మాటలు వినపడ్డాయి:

"నేను పైనుంచి పడితే ఏం చేస్తావు?"

"ఏమీ చెయ్యను. కావాలంటె నా పైనే పడు," అన్నాడు ప్రగల్భుడు.

"ఎలా పడమన్నావు? మొత్తంగా పడనా, ముక్కలు ముక్కలుగా పడనా?" అన్న ప్రశ్న మళ్లీ వినిపించింది

"నువు నుసినుసిగా రాలినా నాకేమీ అభ్యంతరం లేదు," అన్నాడు ప్రగల్భుడు.

అతను ఆ మాట అన్న మరుక్షణం ఒక కాలు దభీమని పై నుంచి పడింది. దాని తరవాత ఒక చెయ్యీ, ఇంకో కాలూ, తలా,



ఇలా మనిషి శరీర భాగాలు ప్రగల్భుడి చుట్టూ రాలి పడ్డాయి.

ప్రగల్భుడు ఏ మాత్రమూ చలించకుండా, "ఈ ఆట ఇకచాలు. నీ భాగాలన్నీ కూడదీసుకుని పూర్తి అవతారంతో కనిపించి, ఈ ఇంటిని పట్టుకుని ఎందుకు వేళ్ళాడుతున్నావో, ఎందుకు జనాన్ని భయపెడుతున్నావో చెప్పు," అన్నాడు.

అతను చూస్తూండగానే శరీర భాగాలన్నీ చేరుకుని ఒక ఆకారం ప్రగల్భుడి ముందు నిలబడి, నీరసంగా ఇలా అన్నది:

"నేనీ యింటి యజమానిని. బతికున్న కాలంలో నేను అక్రమంగా ఇంకొకడి ఆస్తి హరించాను. నేను చేసినది నీచమైన దొంగతనం. ఆ ఆస్తిని నా భార్యచేత ఆ మనిషికి ఇప్పిస్తేనేగాని నాకు ముక్తి ఉండదు. నువ్వు వెళ్ళి నా భార్యకు ఈ మాట చెప్పి నాకీ హీనమైన జీవితం నుంచి త్వరగా విముక్తి కలిగించు."

ప్రగల్భుడు అలాగే చేస్తానని మాట ఇవ్వగానే దయ్యం మాయమై పోయింది.

ఇంకా తెల్లవార లేదు. అయినా ప్రగల్భుడు వెంటనే బయలుదేరి ఇంటి యజమానురాలి వద్దకు వెళ్ళాడు. అంత చీకటితో అతను రావటం చూసి, పాడు పెట్టిన ఇంట్లో అతనికేదో భయోత్పాతం కలిగిందనుకున్నది ఇంటావిడ.

అయితే ప్రగల్భుడు చెప్పినదంతా విన్నాక ఆమెకు పరమానందమయింది.

"ఆ ఇంట్లో దయ్యంగా తిరుగుతున్నది నా భర్తేనా? ఆయన చెప్పిన కుటుంబం నాకు తెలుసు. పాపం, వాళ్ళు కటిక దారిద్ర్యంతో బాధపడుతున్నారు. వాళ్ళకు వాళ్ల ఆస్తి వెంటనే ఇచ్చేస్తాను. నువ్వు నిజంగా ఎంతో ధైర్యవంతుడివి. కనకనే నా భర్తకు విముక్తి లభించింది. నాయనా, నువ్వు ఎక్కడి నుంచి వస్తేనేం? మా కుటుంబానికి ఎంతో మేలు చేశావు. నా కూతురు

నిచ్చి పెళ్ళి చేస్తాను. నిక్షేపంగా మాతోనే ఉండిపో. మరెక్కడికీ వెళ్ళకు," అన్నది ఆ ఇల్లాలు.

ఆమె కూతురు చాలా చక్కనిది; బుద్ధి మంతురాలు. కాని ప్రగల్భుడికి సాహస కృత్యాలు చెయ్యాలని ఉండటం చేత అతనికి ఒకచోట స్థిరపడి పోవాలని లేదు.

"నన్ను క్షమించండి. నేను ఒకచోట స్థిరంగా ఉండలేను. అపాయాలను వెతుక్కుంటూ తిరిగే వాడికి బ్రహ్మచర్యమే మేలు," అన్నాడు ప్రగల్భుడు ఆమెతో.

ఆమె కుమార్తె రెండు పావురాలను పంజరంతో సహా అతనికి బహుమానంగా ఇచ్చింది.

ఆ తల్లి కూతుళ్ళకు వీడ్కోలు చెప్పి ప్రగల్భుడు తన సేవకుడితో సహా ఆ నగరం నుంచి బయలుదేరాడు. వాళ్ళు తెల్లవారుతూనే బయలుదేరి మధ్యాహ్నానికల్లా ఒక అందమైన వనప్రాంతం చేరుకుని చెట్ల నీడలో విశ్రాంతి తీసుకున్నారు.

అప్పుడు సేవకుడు ప్రగల్భుడితో, "ఈ పావురాలు, చూడండి, స్వేచ్ఛ కోసం ఎట్లా కొట్టుకుంటున్నాయో! మన వెంట ఇవి కూడా దేనికి?" అన్నాడు.

"నిజమే," అంటూ ప్రగల్భుడు పంజరం తలుపు తెరిచాడు. వెంటనే పావురాలు పైకి వచ్చి, ప్రగల్భుడి ముఖం ముందు



రెక్కలను పెద్ద చప్పుడుతో ఆడించి, ఎగిరిపోయాయి.

వాటి రెక్కల చప్పుడుకు ప్రగల్భుడి గుండె గుబుక్కుమన్నది. అతను క్షణం పాటు భయపడ్డాడు!

అంతే, ఆ క్షణంలో అతని తత్వమంతా మారిపోయింది. దేశాటన చెయ్యాలనీ, సాహస కృత్యాలు చెయ్యాలనీ ఇంతవరకూ ఉండిన ఉత్సాహం ఒక్కసారిగా అంతరించి పోయింది. అతను వెంటనే తిరిగి వచ్చి, ఆ ఇల్లాలి కుమార్తెను పెళ్ళాడి, అక్కడే సుఖంగా స్థిరపడిపోయాడు. తన కుమారుడిలో కలిగిన ఈ మార్పు తెలిసి అతని తండ్రి కూడా సంతోషించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ఎంతెంత సాహసాలో చేసి, ఎన్నో ప్రమాదాల నెదుర్కొన్న నిర్భయుడు ప్రగల్భుడు సాధువులైన పావురాలను చూసి భయపడటమేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "భయం అపాయం వల్లనే కలుగుతుందనుకోవటం పొరపాటు. సాహసకార్యాలు చేసేవారంతా భయం ఎరగని వాళ్ళు అనుకోవటం కూడా పొరపాటే. మహాయోధుడికి కూడా భయం ఉండవచ్చు. భయమన్నది అనుభవం లేని వాడు ఎలాటి ప్రమాదాన్నయినా ఎదుర్కొగలుగుతాడు. ప్రమాదం యొక్క స్వభావం తెలియనప్పుడే భయం అన్నది ఏర్పడుతుంది. పావురాలు సాధువులే గాని అవి తమ రెక్కలతో అసాధారణమైన ధ్వని చేస్తాయి. అలాటి చప్పుడు ముఖం ఎదట అకస్మాత్తుగా కలగటంతో ప్రగల్భుడు దడుచుకున్నాడు," అన్నాడు.

రాజు కి విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# నరబలి

గాంధారదేశంలో ఒక నది ఉండేది. ఏటా అది నలభై మందిని బలి పుచ్చుకుంటుందని చెప్పుకునేవాళ్ళు. జనం రకరకాలుగా బలి అయేవాళ్ళు. నది ఒడ్డున మనుషులు నడుస్తూ ఉండగా అకస్మాత్తుగా నది పొంగి, వాళ్ళను తన ప్రవాహంలోకి ఈడ్చుకుపోయేది. ఎవరైనా నదిలో స్నానాలు చేస్తుంటే వారున్నచోట ఆకస్మికంగా సుడి ఏర్పడి, స్నానాలు చేసేవాళ్ళు అందులో చిక్కుకుని పోయేవాళ్ళు. నదిపైన అక్కడక్కడా వంతెన లుండేవి. వాటి మీదుగా మనుషులు దాటేటప్పుడు వంతెన విరిగి పడిపోయేది. ఆ నదిని 'పిశాచీ' అని పిలిచేవాళ్ళు.

ఏటా నలభైమందిని పొట్ట పెట్టుకున్నప్పటికీ ఆ నది గాంధార ప్రజలకు జీవనాధారంగా ఉండేది. దాని కింద పుష్కలంగా పంటలు పండేవి. అది పొర్లినప్పుడు కొన్ని వందల చెరువులు నిండి, జనానికి నీటి సౌకర్యం కలిగేది.

పిశాచీ నదికి అధిష్ఠాన దేవత ఉన్నదనీ, ఆమె నరబలి తీసుకుని, ప్రజలకు మేలు చేస్తుందనీ అంతా నమ్మేవారు.

గాంధారదేశానికి గిరివర్మ అనేవాడు రాజుగా వచ్చాడు. పిశాచీనదికి తన ప్రజలు ఏటా బలికావటం ఆయన ఏ మాత్రమూ సహించలేక పోయాడు. అందుచేత ఆయన, పిశాచీనదిలో ఎవరూ స్నానాలు చేయరాదనీ, దానిపై గల వంతెనలను ఉపయోగించరాదనీ, దాని తీరాలకు వెళ్ళటం గాని, అక్కడ ఇళ్ళు కట్టుకోవటం గాని చెయ్యరాదనీ ఉత్తరువిచ్చాడు. ప్రజలకు రాజంటే చాలా అభిమానం. వాళ్ళు ఆయన ఉత్తరువులు శ్రద్ధగా పాలించారు.

దీని ఫలితంగా నదికి మనుషులు బలి కావటం పూర్తిగా నిలిచిపోయింది. వరసగా

టి. మహేశ్వర్

రెండేళ్ళపాటు పిశాచీనదిలో ఒక్కడు కూడా పడిపోలేదు.

మూడో ఏడు నది ఎండిపోయింది. కొండలపైన వర్షం పడింది, కాని నదిలోకి ఒక్క చుక్క నీరుకూడా రాలేదు. వేసవిలో కొండల మీది మంచు కరిగింది; నదులన్నీ పూటుగా ప్రవహించాయి; కాని పిశాచీ నదిలో నీరు లేదు.

రెండో ఏడు ఆరంభమవుతూనే చెరువు లన్నీ వట్టిపోయాయి. పొలాలకు నీరు లేదు. తాగటానికి నీరు లేదు. సస్యక్షేత్రాలు బీడు పడిపోయాయి. పైర్లతో పచ్చపచ్చగా కని పించవలసిన దేశం ఎడారిలాగా కనిపించ సాగింది. ఆ ఎడారిలో లేచిన దుమ్ము దూరప్రాంతాల ప్రసారించి, ఎడారి విస్త రించుతున్నట్టు కనిపించసాగింది.

దేశం భయంకరమైన క్షామం వాత పడింది. రాజు ఆందోళన చెందాడు. నది ఎందుకు మాయమయిందో తెలుసుకుందా మని ఆయన సపరివారంగా నది ఎగువకు ప్రయాణమై వెళ్లాడు. పిశాచీనది కొండల నుండి దిగివచ్చే కనుమకు అడ్డంగా బ్రహ్మాండమైన కొండరాయి పడి వున్నది. దాన్ని తొలగించినట్టయితే నది ఎప్పటిలాగా ప్రవహిస్తుంది. కాని అంత పెద్ద రాతిని ఎవరు తొలగించగలరు? ఎలా తొలగించటం?



"మహారాజా, ఈ కొండరాయిని అడ్డు వేసినది మానవశక్తి కాదు. పిశాచీ మహా తల్లికే ఈ పని సాధ్యం. ఆ దేవినే ప్రార్థించండి. ఆమె దయ ఉంటే ఈ రాయి తొలగిపోతుంది," అన్నారు రాజుగారి మంత్రులు.

గిరివర్మ ఒంటరిగా కొండల పైకి వెళ్ళి, పిశాచినదీ దేవతను ప్రార్థించాడు. "తల్లీ, నీ బలి నువు పుచ్చుకో. నేను అడ్డు పెట్టను. కాని నా దేశాన్ని ఎడారి మాత్రం కానివ్వకు. నా ప్రజలందరూ ఆకలిచావులు చస్తే నీ కేమి లాభం?" అంటూ ఆయన కన్నీరు కార్చాడు.

తరవాత ఆయన అక్కడే విశ్రమించి మగతనిద్రలో పడిన సమయంలో ఒక మహాశక్తి కలలో కనిపించి, "రాజా, నేను మళ్ళీ నీ దేశంలోకి అడుగు పెట్టేటట్టు చేయాలంటే నాకు మామూలు నరబలి చాలదు. నలభై మంది పండితోత్తములను బలిపెట్టు. ప్రసన్నురాలి నవుతాను," అని మాయమైంది.

రాజు ఉలికిపడి లేచాడు. నది కోరిక ఆయనను చాలా కలవర పెట్టింది. అది వరకు ఆయన తన అధికారాన్ని వినియోగించి తన ప్రజలు నదికి బలి కాకుండా అపగలిగాడు. అదే అధికారాన్ని ఉపయోగించి నలభైమందిని, అందులోనూ పండి





తోత్తములను, "మీరు నదికి బలి కండి!" అని ఎలా ఆజ్ఞాపించటం?

విచారగ్రస్తుడై రాజు తన రాజధానికి తిరిగి వచ్చి, తన రాజ్యంలో ఉన్న గొప్ప పండితు లందరినీ తన వద్దకు పిలిపించమని మంత్రులతో చెప్పాడు.

మూడోనాటికల్లా అనేకమంది పండితులు రాజుగారి ఎదట హాజరయారు. రాజు వారి నందరినీ లెక్కించాడు. అంతా కలిసి నలభై ఒక్క మంది ఉన్నారు. అవసరమైన దానికన్న ఒక మనిషి ఎక్కువే ఉన్నాడు.

రాజు ఆ వచ్చినవారితో, "పండితోత్తములారా, పిశాచీనది ఎండిపోయి దేశం ఎలా దుర్భిక్షం పాలయినదీ మీరు చూస్తూనే ఉన్నారు. నేను నదీదేవతను ప్రార్థించి ఆమె వల్ల వరం పొందాను. నలభైమంది పండితులను తనకు బలి ఇస్తే ఆ దేవత మన దేశాన్ని కటాక్షిస్తానన్నది. దేశం కోసం మీలో బలి కావటానికి ఎవరన్నా ఉండే పక్షంలో దేశానికి మహోపకారం చేసిన వారవుతారు," అన్నాడు.

ఆయన ఎవరినీ శాసించ దలచలేదు.

మొదట అందరూ కొయ్యబారి పోయి ఏ జవాబూ ఇవ్వలేదు తరవాత ఒకరొకరే తప్పుకునేటందుకు సాకులు చెప్పసాగారు.

"నేను బలి అవుదును గాని, నా పిల్ల లందరూ పసివాళ్లు. నేను లేకుంటే వాళ్ళు దిక్కులేనివారై పోతారు...."

"నేను ఈ మధ్యనే పెళ్ళి చేసుకున్నాను. నా భార్య గర్భవతి...."

"నేనొక మహా కావ్యం రాస్తున్నాను. అది సగం మాత్రమే అయింది...."

ఇలా తలా ఒక కారణమూ చెప్పి, ఎవరూ నదికి బలి కావటానికి ఒప్పుకున్నారు కారు. కాని చివరకు ఒకే ఒకడు భగీరథ శర్మ అనేవాడు రాజుతో, "మహారాజా, నేను బలి కావటానికి సిద్ధంగా ఉన్నాను. నా ఒక్కడితోనే తృప్తి చెందమని నదీ

దేవతను ప్రార్థిస్తాను. దేవత అనుగ్రహించవచ్చు," అన్నాడు.

రాజు ఆ పండితుడికి తల వంచి నమస్కరించి, "మీ విన్నపం ఆలకించి నది పర్వతాలు దిగి వచ్చినట్టయితే మీ కీర్తి ఆ చంద్రతారార్కం నిలిచి ఉంటుంది. వెళ్ళిరండి," అన్నాడు.

భగీరథశర్మ పర్వతాల వద్దకు బయలుదేరాడు. మర్యాద కోసం మిగిలిన నలభైమంది పండితోత్తములూ ఆయన వెంట పర్వత ప్రాంతానికి వెళ్ళారు. తన వెంట వచ్చిన పండితులు కిందనే నిలిచిపోగా భగీరథశర్మ పర్వతం పైకి ఎక్కి వెళ్ళాడు.

దిగువన నిలబడి ఉన్నవారికి, తల ఎత్తి చూస్తే, బ్రహ్మాండమైన కొండరాయి కనిపిస్తున్నది. దాని వెనక నదీజలం దిగ్బంధమై ఉన్నది. భగీరథశర్మ ఏం ప్రార్థనలు చేస్తాడు? ఎలా నదికి బలి అవుతాడు? అతగాడి ప్రార్థనలకు అంత లావు కొండరాయి అడ్డం తొలుగుతుందా? ఈ విధంగా తమలో తాము మాట్లాడుకుంటున్నారు దిగువనున్న పండితోత్తములు.

ఇంతలో వారికి పైనుంచి సన్నగా హోరు వినపడింది. అది క్రమంగా పెద్దదయింది. అకస్మాత్తుగా కొండరాయి తొలగి బ్రహ్మాండమైన వేగంతో పర్వతపు చరియకు తగిలి, దారికి పెడ తొలిగి, నలభైమంది పండితోత్తములూ నిలబడి ఉన్న చోట పిడుగులాగా పడిపోయింది.

ఒక్క పండితుడి ప్రాణాలూ దక్కలేదు. అందరూ బలి అయి పోయారు. భగీరథశర్మ మాత్రం క్షేమంగా పర్వతం దిగి వచ్చాడు.

పిశాచీనది తిరిగి ఎప్పటిలాగే ప్రవహించింది. పిశాచికి ప్రజలు కొలుపులు చేశారు. చనిపోయిన పండితుల కుటుంబాలన్నిటికీ రాజు పుష్కలంగా భరణాలిచ్చి ఆదుకున్నాడు.



# విదూషకుడు

ఒక రాజుగారు తన ఆస్థానంలో విదూషకుణ్ణి ఏర్పాటు చేయగోరి, ఆ పదవికి పోటీ చేయ దలచిన వారందరూ ఫలానా రోజు తన సభకు రావలసిందని చాటింపు వేయించాడు. ఆ నాటికి కొన్ని వందలమంది విదూషకులు వచ్చి సభ సలంకరించారు.

రాజు వారితో, "తాను నవ్వకుండా ఇతరులను నవ్వించగలవాడే విదూషకుడు. ఆ సంగతి గుర్తుంచుకుని, ఆస్థానవిదూషకులు కాగోరేవారు ఒకరొకరే ఈ సభను నవ్వించ యత్నించండి," అన్నాడు.

ఒక్కొక్కరే లేచి తమకు తోచిన హాస్యప్రసంగాలు చేశారు. శ్రోతలందరూ పోటీదార్లే గనక వాళ్ళు ఏ ప్రసంగానికీ నవ్వలేదు.

చివరకు ఒక పొట్టివాడు లేచి నిలబడ్డాడు. వాడు ఏం మాట్లాడుతాడోనని అందరూ చూస్తున్నారు. కాని వాడేమీ మాట్లాడలేదు. అందరి కేసీ చూస్తూ అలాగే నిలబడిపోయాడు. వాడి ఉద్దేశం ఏమిటో ఎవరికీ అంతు చిక్కలేదు. రాజుగారికి వాణ్ణి చూస్తే చాలా కోపం వస్తుందనీ, వాడికి శిక్ష పడుతుందనీ కూడా అందరూ అనుకున్నారు.

పొట్టివాడు దిక్కులు చూస్తూ చాలాసేపు అలాగే నిలబడి ఉన్నమీదట సభికులలో ఎవరో, "చాల్లే, వెళ్ళి కూర్చో," అన్నారు. వెంటనే పొట్టివాడు తన ఆసనం వద్దకు బయలుదేరాడు.

రాజుగారు పక్కున నవ్వాడు. వెంటనే సభికులందరూ కూడా నవ్వారు. రాజుగారు ఆ పొట్టివాణ్ణే ఆస్థానవిదూషకుడుగా నియమించాడు. —వై. వీరేంద్రనాథ్ (బికాం. సి. ఎ.)





# అనాకారి వధువు

పూర్వం ఒక బలసంపన్నుడైన రాజుండే వాడు. ఆయన కొక కుమార్తె ఉండేది. ఆమె చాలా అనాకారి. కాని తండ్రి కళ్ళకు ఆమె అతిలోక సుందరి లాగా కనిపించేది, ఎందు కంటే ఆ రాజుకు తన కూతురంటే పంచ ప్రాణాలు. తండ్రి తనను సాటిలేని సుందరి అంటూంటే కుమార్తె కూడా తను అంద గత్తె ననే అనుకున్నది. రాజుగారి మాట కాదనే ధైర్యం లేక ఆయన కింద కొలువు చేసే వారంతా రాజకుమార్తె అందాన్ని వేనోళ్ళ పొగుడుతూ వుండేవారు.

రాజకుమార్తెకు యుక్తవయసు వచ్చింది. రాజు ఆమెకు వివాహం చేయ నిశ్చయించి, ఒక దూరదేశపు రాజకుమారుణ్ణి వరుడుగా ఎన్నుకున్నాడు. ఆ కుర్రవాడు బుద్ధిమం తుడు, తెలివితేటలు గలవాడు. అతని తండ్రి రాజకీయ కారణాలవల్ల ఈ సంబంధం అనుకూలంగా భావించి, కొడు కును పెళ్ళికి ఒప్పించాడు. రాజకుమారుడు తండ్రి చెప్పగానే ఒప్పుకున్నాడు. ఎందు కంటే అతని మనసు ఎవతె మీదా లగ్నం అయి ఉండలేదు. తనకు తండ్రి నిర్ణయిం చిన రాజకుమార్తె అందగత్తె అని పుకారు కూడా వున్నది.

కాని అతను తీరా బయలుదేరి వచ్చి, తాను పెళ్ళాడనున్న వధువును చూసేసరికి అతనికి కంపరం పుట్టుకొచ్చింది. అతను ఆమె సరసన కూర్చోవటానికి ఒప్పుకోలేదు.

"అదేం?" అన్నాడు వధువు తండ్రి.

"అబ్బో, ఇంత అందం చూసేసరికి నా కళ్ళు జిగేలు మంటున్నాయి. ఒళ్ళంతా కంపరమెత్తుతున్నది. నన్ను క్షమించండి," అన్నాడు వరుడు.

"నీకు కాబోయే భార్య కాదుటోయ్? అంత బిడియపడితే ఎలా?" అన్నాడు వధువు తండ్రి.

ఆర్. దయానందరావు

"ఇంత అందగత్తెను నేను పెళ్ళాడ జాలను. నేను ఆమెకు ఎంతమాత్రమూ అర్హుణ్ణి కాను. నన్ను మీరు మన్నించాలి," అన్నాడు వరుడు.

అంతా నిశ్చయమయాక పెళ్ళికొడుకు ఇలా వెనక అడుగు వెయ్యటం చూసి రాజుకు సహించరాని ఆగ్రహం వచ్చింది. కాని అంతలోనే రాజకుమార్తె తన తండ్రితో, "నా అందానికి రాజకుమారుడు తగని పక్షంలో నేనొక విద్వాంసుణ్ణి పెళ్ళాడ తాను," అన్నది.

రాజు ఆస్థానవిద్వాంసుణ్ణి దగ్గిరికి పిలిచి, "ఏమయ్యా, నిన్ను మించిన విద్వాంసుడు మన దేశంలో లేడు. అందుచేత నువే అమ్మాయిని పెళ్ళాడు," అన్నాడు.

విద్వాంసుడు వణికిపోతూ, "మహారాజా, ఇదెక్కడైనా కద్దా? అదివరకే ఒకతెను అగ్నిసాక్షిగా పెళ్ళాడి, బిడ్డలను కన్నవాణ్ణి. శ్రోత్రియుణ్ణి. నన్ని వర్ణాంతర వివాహం చేసుకోమని తమరు కోరటం భావ్యం కాదు," అన్నాడు.

"బ్రాహ్మలు నాలుగువర్ణాల కన్యలనూ పెళ్ళాడవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి," అన్నాడు మంత్రి.

"దాని కేమంటావు? అమ్మాయి విద్వాంసుణ్ణి చేసుకుంటా నంటున్నది. ఆమె కోరిక



నా ఆజ్ఞతో సమానం. దాన్ని నువు ఉల్లం ఘించరాదు," అన్నాడు రాజు.

"మహారాజావారు నన్ను క్షమించాలి. ఇది నా వల్ల అయే పని కాదు. తమ ఆజ్ఞ పాలించనందుకు ఏ శిక్ష విధించినా సంతోషంగా భరిస్తాను," అన్నాడు విద్యాంసుడు.

"రేపు ఉదయం లోపల నా దేశం విడిచి వెళ్ళు," అన్నాడు రాజు ఆగ్రహావేశంతో.

పరిస్థితి విషమించింది. ఈ రాజు తనను కూడా శిక్షించవచ్చునని వరుడుగా వచ్చిన రాజకుమారుడికి తోచింది.

"మహారాజా, రాజకుమార్తె వివాహం జరిగి తీరాలి; జరుగుతుంది కూడానూ. అందుకు నేనొక సూచన చేస్తాను. నచ్చితే మీరలా చేయవచ్చు," అన్నాడతను.

"చెప్పు," అన్నాడు రాజు.

"సుక్షత్రియులైన యువకులను ఏరి తెచ్చి, వారి మధ్య ద్వంద్వయుద్ధాలు ఏర్పాటు చెయ్యండి. అందరినీ జయించిన వాడు రాజకుమార్తెను పెళ్ళాడతాడు. ఈ పోటీలో నేను కూడా విధిగా పాల్గొంటాను," అన్నాడు రాజకుమారుడు.

రాజు నగరంలో ఉన్న క్షత్రియయువకులను పిలిపించి, వారి మధ్య ద్వంద్వ యుద్ధాలు ఏర్పాటు చేశాడు. వచ్చినవారంతా కత్తులు తీసుకుని ఎదురెదురుగా నిలబడి,



రాజుగారు ఆజ్ఞాపించగానే, పెద్ద పెట్టున రంకెలు పెడుతూ, కదను తొక్కుతూ కలియబడ్డారు. ద్వంద్వయుద్ధాలు ఎంత సేపు జరిగినా ఎవరికీ సూది గుచ్చుకున్న పాటి గాయమైనా కాలేదు.

ఇది గమనించి రాజు యోధులతో, "మీలో ముందు ఎవడు గాయపడితే వాడు నా కుమార్తెను చేసుకుంటారు!" అన్నాడు.

వెంటనే ద్వంద్వయుద్ధాలు కుక్కల కొట్లాటగా మారాయి. ప్రతి ఒకడూ తాను గాయపడే లోపల అవతలివాణ్ణి గాయపరచ టానికి విశ్వప్రయత్నం చేశాడు. కళ్ళు మూసి కళ్ళు తెరిచేలోపల అందరూ గాయపడ్డారు. ముందు గాయపడిన దెవరో చచ్చినా నిర్ధా రణ కాలేదు. ఎవడిమటుకు వాడు, అవ తలివాడే తన కన్న ముందు గాయ పడ్డట్టు చెప్పాడు.

ఇదంతా చూసి రాజకుమార్తెకు వైరాగ్యం వచ్చేసింది. ఆమె తన తండ్రితో, "నాన్నా, నా అందం చూసి బెదిరిపోయే వీళ్ళను నేనెలా పెళ్ళి చేసుకుంటాను? ఇంతకంటె పెళ్ళి లేకుండా ఉండటం మేలు," అన్నది.

అప్పుడు ఆస్థాన గాయకుడు ఒక మూల నుంచి, "మహారాజా, నాదొక్క మనవి," అన్నాడు. అతను గుడ్డివాడు.

"ఏమిటి నీ సూచన?" అన్నాడు రాజు.

"నేను పుట్టుగుడ్డిని. పెళ్ళికాని వాణ్ణి. రాజకుమార్తె అందచందాలు చూసి ఆనం దించే యోగ్యతగాని, బెంబేలు పడే భయం గాని నాకు లేదు. అందుచేత ఆమెను నా కిచ్చి చెయ్యండి. నన్నొక యింటివాణ్ణి చేసిన పుణ్యం మీకు దక్కుతుంది," అన్నాడు ఆస్థానగాయకుడు.

రాజకుమార్తె ఆ గుడ్డిగాయకుణ్ణి పెళ్లాడ టానికి తక్షణం ఒప్పుకున్నది. రాజు సంకో చించ కుండా ఇద్దరికీ పెళ్లి చేసేశాడు. ఆ దంపతు లిద్దరూ ఎంతో అన్యోన్యంగా జీవించారు.





# గర్వభంగం

పురుషపుర రాజుకు సౌదామిని అనే కుమార్తె ఉండేది. ఆమె ఎంతో గారాబంగా పెరిగి ఉండటం చేతనూ, గొప్ప అందగత్తె కావటం చేతనూ మకురుగానూ, గర్విష్ఠి గానూ తయారయింది.

సౌదామినికి పద్దెనిమిదేళ్ళు నిండాయి. ఆమె తండ్రి ఆమెకు వివాహం చేయ సంకల్పించాడు. ఆయన ఎందరో రాజకుమారులను గురించి ఆలోచించి, మణిపుర రాజకుమారుడైన చిత్రాశ్వుడనేవాణ్ణి తన కుమార్తెకు తగిన వరుడుగా నిర్ణయించాడు. వధూవరులు ఒకరినొకరు చూసి తృప్తి పడగలందులకు చిత్రాశ్వుణ్ణి పురుషపురానికి ఆహ్వానించాడు. ఇద్దరూ సరేనన్న మీదట ప్రధానం చేసి, పెళ్ళి ముహూర్తం పెట్టాలని రాజు అభిప్రాయం.

కాని రాజు ఉద్దేశం కొనసాగలేదు. మకురుతనమూ, అతిశయమూ బాగా వంటబట్టిన సౌదామిని చిత్రాశ్వుణ్ణి అకారణంగా అవమానించింది. అతను ఆగ్రహావేశంతో సౌదామినిని దూషించి, "ఇంత పొగరుగల నువు తిండికి మాడిపోతావు, ఏ గుంట నీరైనా తాగుతావు, కటికనేల మీద పడుకుంటావు. అప్పుడుగాని నీ పొగరు అణగదు," అని తిట్టి, తన పరివారంతో సహా అప్పటికప్పుడే బయలుదేరి, మణిపురానికి వెళ్ళిపోయాడు.

అతిథిగా వచ్చినవాడు తనను ఇంత అవమానిస్తే తన తండ్రి తనను సమర్థిస్తాడని సౌదామిని అనుకున్నది. కాని ఆమెకు తీవ్రమైన ఆశాభంగం కలిగింది. ఎందుచేతంటే ఆమె తండ్రి ఆమెను క్రూరంగా శిక్షించాడు. "నీ మూలంగా నాకు చాలా అప్రతిష్ఠ కలిగింది. నిన్ను రాజ్యం నుంచి బహిష్కరించేస్తున్నాను," అన్నాడాయన.

జి. శాంతాదేవి

ఆయన సౌదామినిని కట్టుబట్టలతో తన రాజ్యం పొలిమేర దాటించి పంపేశాడు. ఆమెను అక్కడిదాకా దిగబెట్టిన వాళ్ళు వెనక్కి తిరిగి వెళ్ళిపోయారు.

తలవనితలంపుగా తనకు ఇంత దుస్థితి ఏర్పడినందుకు సౌదామిని ఏడుస్తూ ఒక చెట్టు కింద కూలబడిపోయింది. తాను ఎంతో తప్పు చెయ్యకపోతే తన తండ్రి తన కింత దారుణమైన శిక్ష విధించడని ఆమెకు తోచింది. ఈ ఆలోచన వెంటనే ఆమెకు కొద్దిగా స్వస్వరూపజ్ఞానం కూడా కలిగింది.

సౌదామిని అలా కూర్చుని ఏడుస్తూండగా ఒక వృద్ధుడు అటుగా వచ్చాడు; ఆమెను చూసి ఆగి, "ఎవరమ్మా? ఎందుకు ఇక్కడ కూర్చుని ఏడుస్తున్నావు?" అని అడిగాడు.

ఎంతలేసి వాళ్ళనూ లెక్క చెయ్యని సౌదామినికి ఆ వృద్ధుడు దేవుడల్లే కనిపించాడు. ఆమె తనకు కలిగిన కష్టాన్ని ఆ వృద్ధుకి చెప్పుకున్నది.

"మహామహా వాళ్ళకే కష్టాలు తప్పలేదు. ఏం చేస్తాం? నేను మా దేశం పోతున్నాను. నీకు అభ్యంతరం లేకపోతే నా వెంట రా!" అన్నాడు వృద్ధుడు.

సౌదామిని సంతోషంగా వృద్ధుడి వెంట బయలుదేరింది. కాని ఆమెకు నడక అలా



వాటు లేదు. కొంచెం దూరం నడిచేసరికే కాళ్ళు బొబ్బలెక్కాయి. కాని వృద్ధుడు వినుకోలేదు. ఆమె కోరినప్పుడల్లా ఏ చెట్టు కిందనో విశ్రాంతి తీసుకోనిచ్చాడు. ఆ వృద్ధుడి వంటి దయాపరుడు ప్రపంచంలో ఉండడని సౌదామిని అనుకున్నది.

ఆమెకు ఆకలి అయింది. వృద్ధుడు తన వద్ద వున్న అటుకులూ, బెల్లమూ ఇచ్చాడు. ఆ ఆహారం తినవలసి వచ్చేసరికి ఆమెకు ఏడుపు వచ్చింది.

"అమ్మా, నిజంగా ఆకలే ఉంటే అదే అమృతం లాగుంటుంది. ఆకలి రుచి ఎరగదు," అన్నాడు వృద్ధుడు. ఆ మాట నిజమేనని సౌదామినికి తెలిసి వచ్చింది.

ఆమెకు దాహమయింది. సమీపంలోనే ఒక నీటిగుంట ఉన్నది. అందులో నీరు మురికిగా ఉన్నది.

"ఈ నీరు ఎలా తాగటం?" అన్నది సౌదామిని.

"నీకు అంతగా దాహం లేకపోతే ఇంత కన్న మంచినీరు ముందు దొరుకుతుందేమో చూద్దాం," అన్నాడు వృద్ధుడు.

"దాహం లేకపోవట మేమిటి? నాలుక పిడచ కట్టుకుపోతున్నది," అన్నది సౌదామిని.



"అయితే, ఆ నీరే తాగు తల్లీ. ఇప్పుడు గత్యంతరం ఏముంది గనక?" అన్నాడు వృద్ధుడు.

ఎటూగాని చోట చీకటి పడిపోయింది. సౌదామినికి అలసట వల్ల నిద్ర ముంచుకు వచ్చింది.

"పడుకునేటందుకు అనువైన చోటున్న దేమో?" అన్నదామె.

"ఇదంతా పడుకునే చోటు కాదా, అమ్మా? నిద్ర సుఖం ఎరగదు," అన్నాడు వృద్ధుడు.

ఆ రాత్రి సౌదామిని కటికనేల మీదనే నిద్రపోయింది.

ఈ విధంగా రెండుమూడు రోజులు ప్రయాణం చేసి వారిద్దరూ చివరకు మణిపుర రాజ్యం చేరారు.

"అమ్మాయీ, నువ్వింక ప్రయాణం చెయ్యలేవు. మనమిద్దరమూ ఈ దేశంలోనే ఎలాగైనా పొట్ట పోసుకుందాం. కష్టంచేసి బతకవలసిన వాళ్ళకు ఏదేశం అయినా ఒకటే. నీకేదైనా విద్య తెలుసునా?" అని వృద్ధుడు సౌదామినిని అడిగాడు.

"నాకు చాతనైన విద్య ఒకటే. అది దుస్తులకు నగిషీలు కుట్టటం. అందులో నాకు కొంత నైపుణ్యం ఉన్నది," అన్నది సౌదామిని.

వృద్ధుడు ఆమెను రాజభవనానికి తీసుకుపోయి, అక్కడి వాళ్ళతో ఏకాంతంగా మాట్లాడి వచ్చి, "నువు చెయ్యదలిస్తే దాసీ దాని పని దొరుకుతుందట. నేను వయసు మీరానని నా కేమీ ఉద్యోగ మివ్వమన్నారు. ఏమంటావు?" అన్నాడు సౌదామినితో.

సౌదామిని ఒప్పుకున్నది. ఆమెకు దివాణంలో దాసీగా పని ఇచ్చారు. ఉండటానికి ఒక పశువుల కొట్టంలాటిది ఇచ్చారు. అందులోనే వృద్ధుడు కూడా ఉండవలసి వచ్చింది.

సౌదామినిని రాజభవనంలో ఎవరూ అవమానించలేదు గాని ఉదయం లగా



యతు రాత్రి పొద్దుపోయినదాకా చాలా పని చేయించారు. రెండు పూటలా ఆమె రాజ భవనంలోనే ఇతర నౌకర్లతో పాటు భోజనం చేసింది. ఆమె అలిసిపోయి ఇంటికి వచ్చే సరికి వృద్ధుడు చాలా నిస్పృహతో కని పించాడు.

"తిండి తిన్నావా? రోజల్లా ఏం చేశావు?" అని సౌదామిని అతన్ని అడిగింది.

"పని కోసం తిరిగాను. రోజల్లా తిండి కూడా లేదు. నా కెవరు పని ఇస్తారు?" అన్నాడు వృద్ధుడు.

సౌదామిని చాలా బాధపడింది. తన కిప్పుడు ఆ వృద్ధుడే తల్లీ, తండ్రీ, తోడూ, నీడా కూడా. అందుచేత మర్నాడు ఆమె భోజన సమయంలో ఇంటికి పోవటానికి ప్రయత్నించింది. కాని ఆమెకు అనుమతి లభించలేదు. ఆ రాత్రి ఇంటికి పొయ్యే టప్పుడు తీసుకుపోదామని కొంత భోజనాన్ని దొంగిలించి ఒకమూల దాచింది. దాన్ని మరొక దాసి పసికట్టి, రాజమాతకు చెప్పింది.

"నిన్ను చూసి జాలిదలిచి రాజభవనం లోకి అడుగు పెట్టనిస్తే తిండి దొంగగా తయారయావా?" అని రాజమాత సౌదా మినిని గద్దించింది.

అవమానంతో కుంగిపోయిన సౌదామిని తలవంచుకుని కన్నీరు కార్చింది.





ఈ భవనంలో అడుగు పెట్టవలిసిన తాను దాసిగా ఉండటం ఆమెకు ఎంతో విడ్డూర మనిపించింది.

వృద్ధుడు తనకు ఎక్కడో పని దొరికిందనీ, తిండి కూడా పెడుతున్నారనీ చెప్పాడు ఆ రాత్రి. తాను తిండి దొంగిలించి పట్టుబడిన దంతా వృథా అయింది.

కొద్దిరోజులు గడిచాయి. రాజకుమారుడికి పెళ్లి నిశ్చయమయిందని దివాణంలో అంతా చెప్పుకున్నారు. పెళ్ళికూతురికి దుస్తులు తయారవుతున్నాయనీ, వాటికి నగిషీలు చెక్కే పని చూడమనీ సౌదామినికి ఉత్తరువు వచ్చింది. ఆమె మామూలు చాకిరీ మానేసి అంతఃపురంలో ఒక గదిలో కూర్చుని ఎంతో అందమైన పట్టుచీరెలకు నగిషీలు కుట్ట నారంభించింది. అప్పుడప్పుడూ రాజమాతా, ఇతర రాజబంధువులూ వచ్చి ఆమె చేసే పనిని మెచ్చుకుని వెళ్ళిపోయేవారు.

మర్నాడే పెళ్ళి అనగా రాజమాత సౌదామిని వద్దకు వచ్చి, "నువు తయారుచేసిన దుస్తులు పెళ్లికూతురు ధరిస్తే ఎలా వుంటుందో చూడాలని ఉన్నది. పెళ్ళికూతురు నీలాగే ఉంటుంది. అందుచేత నువు వీటిని ధరించి చూపించు," అన్నది.

ఇంతలోనే, "పోనీలే, అమ్మా! తెలియక చేసి ఉంటుంది. ఈసారికి క్షమించు," అన్న మాటలు వినిపించాయి. సౌదామిని తల ఎత్తి చూసేసరికి చిత్రాశ్వుడు కనిపించాడు. అతని ముఖంలో ఎంతో దయ కనిపించింది.

అతను తనను గుర్తించాడేమో నని ఆమె భయపడింది, కాని అతను గుర్తించలేదని రూఢి చేసుకున్నది. గుర్తించి ఉంటే తనను తప్పక అవమానించేవాడే నని ఆమె అనుకున్నది. అతనిని తాను అవమానించి ఉండటం పెద్ద పొరపాటని ఆమెకు మరింత బాగా తెలిసి వచ్చింది. అతనికి భార్యగా

సౌదామిని అమితంగా బిడియపడి ఏమీ అనలేకపోయింది.

అంతలోనే మరెవరో, "పెళ్ళికూతురికి వేసే దుస్తులు దాసీదానికి ఎలా వేస్తారు? ఆమెకు శుభ్రంగా తలంటిపోసి మరీ వెయ్యండి," అన్నారు.

కొందరు దాసీలు వచ్చి సౌదామినిని పట్టుకుపోయి రాజోపచారంగా తలంటి పోశారు. అగరు ధూపంతో తల ఆరబెట్టి చిక్కుతీసి, అందంగా జడవేసి పూలు పెట్టారు. ఒకతె వచ్చి సౌదామినికి కల్యాణం బొట్టు వగైరా అలంకరించింది. మరొకతె ఆమె చేతులకూ, కాళ్ళకూ, దండలకూ, మెడకూ నగలు పెట్టింది.

అందరూ నిలబడి సౌదామిని అవతారాన్ని నోళ్ళు తెరుచుకుని చూస్తూండగా పెళ్ళికొడుకు అవతారంలో చిత్రాశ్వుడు వచ్చి, "పెళ్లికూతుర్ని చేసేశారే! నీ అనుమతి తీసుకున్నారా, సౌదామినీ?" అని అడిగాడు.

సౌదామిని చప్పున అతని కాళ్ళమీద పడి, "ఇన్నాళ్ళుగా, నన్ను మీరు గుర్తించలేదనుకున్నాను. నా ధూర్తత్వాన్ని క్షమించండి," అన్నది.

"క్షమించే గదా నిన్ను పెళ్ళాడుతున్నాను! ఇదంతా నేనూ, మీ నాన్నగారూ కలిసి ఆడిన నాటకం. నీ వెంట ఉండే వృద్ధుడు నాకు చాలా సన్నిహితుడైన వాడు; నమ్మినబంటు. నువు నాకు చేసిన అవమానాన్ని నేను మరిచాను. నేను నీకు కలిగించిన కష్టాలను నువు కూడా మరిచిపో," అన్నాడు చిత్రాశ్వుడు.

సౌదామిని అప్పటికి పూర్తిగా మారిపోయింది. తన పొగరు అణచటానికి ఇంకా ఎక్కువ కష్టాలు పెట్టినా పడటానికి ఆమె సిద్ధంగానే ఉన్నది. అందుచేత వారిద్దరి మధ్యా ఎలాటి విభేదాలూ మిగలలేదు. ఇద్దరూ వైభవంగా పెళ్ళి చేసుకుని, సుఖంగా జీవించారు.



# పండితుడి తెలివితక్కువ

ఒక గ్రామంలో ఒక దాంభికుడైన పండితు డుండేవాడు. అయన తన పాండిత్య ప్రకర్ష గురించి ఊళ్ళోవాళ్ళ దగ్గిర తెగ గప్పాలు కొడుతూండేవాడు.

చివర కొకనాడు ఒక గడుసువాడు పండితుడితో, "బాబూ, నీ పాండిత్యం గురించి మన ఊళ్ళో తెలీని వాడెవడు? కాని అది ఇక్కడ అడివిగాచిన వెన్నెల అయిపోతున్నది. ఊళ్ళూళ్ళు తిరుగు. ఎక్కడెక్కడి పండితులనూ ఓడించు. నీ పాండిత్యం దేశదేశాలా చాటు. మన ఊరికి గొప్ప కీర్తి తీసుకురా!" అన్నాడు.

ఈ మాట పండితుడికి నచ్చింది. అతను మంచి రోజు చూసి తన గ్రామం నుంచి బయలుదేరాడు. ఇంకొక గ్రామం చేరవస్తుండగా ఊరి బయట గొర్రెలను కాచుకునే వాడొకడు కనబడ్డాడు. "అబ్బీ, మీ గ్రామంలో పండితు లెవరన్నా ఉంటే చెప్పు. వాళ్ళను నేను ఓడించాలి. నేనొక వల్లమాలిన పండితుణ్ణి," అన్నాడు అతను.

గొర్రెలను కాచుకునేవాడికి ఈ పండితు డొక వదరుబోతు లాగా కనబడ్డాడు. పండితుడు చూస్తూండగానే వాడు వంగి, గుప్పెడు ఇసక తీసి, "బాబయ్యా, నా చేతిలో ఎంత ఇసక ఉందో చెప్పండి," అన్నాడు.

పండితుడు ఆగ్రహించి, "నే నడిగిన దేమిటి? నీ ఎదురుప్రశ్న ఏమిటి? నీ చేతిలో ఎంత ఇసక ఉందో నేను కొలిచానా, తూచానా?" అన్నాడు.

"గుప్పిట్లో గుప్పెడు ఇసక ఉందని చెప్పలేని వాడివి నువేం పండితుడివయ్యా?" అని గొర్రెలు కాచేవాడు హేళన చేశాడు.

పరాభవం పొందిన పండితుడు తన గ్రామానికి తిరిగి వచ్చి, గప్పాలు కొట్టటం మానుకున్నాడు.

—కోకా వెంకట సత్యప్రసాద్






# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

## మూడవ యాత్ర

తిరిగే కాలూ, తిట్టే నోరూ ఊరుకోదంటారు. సింద్‌బాద్ ఐశ్వర్యంలో ఓలలాడుతూ, రాజ భోగాలు అనుభవిస్తున్నాడు. అయినా అతనికి సుఖజీవనం ముఖంమొత్తి, దేశాటన మీదికి మనసు మళ్ళింది. దానితో బాటు వర్తకం చెయ్యాలన్న కాంక్ష కూడా కలిగింది. అతను ఖరీదైన వర్తకపు సరుకులు కొని వాటితో బస్రా చేరుకుని, అక్కడ సిద్ధంగా ఉన్న వర్తకపు ఓడలో ఎక్కాడు. అందులో అతని స్నేహితులైన వర్తకులు చాలామంది ఉన్నారు. అతనికి ఏపాటి చిక్కులు వచ్చినా వారు ఆదుకోగలవారే.

కొంత కాలం ప్రయాణం చాలా విజయవంతంగా సాగింది. ఓడ రేవు తాకిన చోటల్లా చురుకుగా వర్తకం సాగింది. సింద్‌బాద్ అనేక కొత్త స్థలాలూ, ఎన్నో కొత్త వింతలూ చూశాడు. వర్తకు లందరూ చాలా ఉల్లాసంగా ఉన్నారు.

ఓడ ముస్లిము దేశాలు అధిగమించి సముద్రమధ్యాన్ని చేరుకున్నది. ఆ సమయంలో ఓడసరంగు అకస్మాత్తుగా నుదురు బాదుకుని, చొక్కా చించుకుని, తలపాగా విసిరి కింద కొట్టాడు.

అతని ఆందోళన చూసి వర్తకులు, "ఏమయింది?" అని అడిగారు.

"అయ్యో, గాలి మనని మోసగించింది. మన దురదృష్టం పండి రాగూడని ప్రాంతానికి వచ్చాం. ఆకాశం అంచున కనిపించే ఆ దీవి చూడండి. ఆ దీవిని మనం చేరబోతున్నాం. అక్కడికి వెళ్ళి ప్రాణాలతో తిరిగి వచ్చినవాడు ఇంతవరకు లేడు. అది మర్కటాల దీవి. మనకు నూకలు చెల్లిపోబట్టే ఈ దీవికి వచ్చి పడుతున్నాం," అన్నాడు సరంగు.

అతను ఈ మాటలింకా ముగించక ముందే దీవి నుంచి వింతమృగాలు సము



ద్రంలో ఈదుకుంటూ వచ్చి, ఓడను చుట్టుముట్టాయి. మరి కొన్ని తీరానే ఉండి భయంకరంగా అరుస్తున్నాయి. ఆ అరుపులు వింటేనే ఓడలో వాళ్ళకు గుండెలు అవిసిపోయాయి. ఈదుకుంటూ వచ్చిన మర్కటాలు ఓడ మీదికి ఎక్కి వర్తకపు సరుకుల బేళ్ళను తడివి చూడసాగాయి. మర్కటాల సంఖ్య ఎంత హెచ్చుగా ఉన్నదంటే, వాటి జోలికి పోయే సాహసం చాలక వర్తకులందరూ వాటిని ఓడలో ఇష్టం వచ్చినట్టు చెయ్యనిచ్చారు.

ఆ మర్కటాలు చాలా వికారంగా ఉన్నాయి. వాటి శరీరాల నిండా బొచ్చు ఉన్నది. వాటి ముఖాలు నల్లగానూ, కళ్ళు ఆకుపచ్చగానూ ఉన్నాయి. అవి మూడు జానల ఎత్తే ఉన్నా, వాటి ముఖభంగిమలూ, అరుపులూ చాలా దారుణంగా ఉన్నాయి. అవి తమ భాషలో తిట్టుతూ ఏమేమిటో అన్నాయి. పళ్ళు కొరికాయి. అవి ఏమంటున్నదీ అర్థంకాక ప్రయాణీకులు నిస్సహాయులుగా నిలబడిపోయారు.

కొన్ని మర్కటాలు తెరచాప స్తంభాల మీదికి ఎగబాకి, తాళ్ళు కొరికి తెంపి, తెరచాపలను కిందపడేశాయి. కొన్ని మర్కటాలు చుక్కాని పట్టుకుని తిప్పాయి. గాలివాలున ఓడ తీరానికి చేరింది. తరవాత అవి ఒక్కొక్క ప్రయాణీకుణ్ణి పట్టుకుని తీరాన చేర్చి, అన్నీ కలిసి ఓడలో ఎక్కి, ఓడను నడుపుకుంటూ కనుచూపుమేర దాటిపోయాయి. అందరూ మర్కటాల దీవిలో చిక్కుకుపోయారు.

వాళ్ళు సముద్రతీరాన ఉండి చేసేది లేదు గనక, దీవి మీదికి బయలుదేరారు. అక్కడ పళ్ళచెట్లూ, వాగులూ ఉన్నాయి. వాళ్లు చెట్ల నుంచి పళ్ళు కోసుకుని తిన్నారు. ఇంతలో వారికి దూరంగా ఒక ఎత్తయిన భవనం కనబడింది. వర్తకులందరూ దానికేసి వెళ్ళారు.

ఆ భవనం నలుచదరంగానూ, చాలా ఎత్తుగానూ ఉన్నది. దాని చుట్టూ ఎత్తయిన ప్రహరీగోడ ఉన్నది. అయితే ఆ గోడలో ఉన్న ద్వారం తెరిచే ఉన్నది. ద్వారం వద్ద కాపలావాళ్ళెవరూ లేరు.

భవనంలోపల విశాలమైన సావడి ఉన్నది. అందులో బ్రహ్మాండమైన వంట పాత్రలూ, మాంసం గుచ్చి కాల్చే ఇనప కాడలూ ఉన్నాయి. నేల మీద ఎముకల గుట్ట లున్నాయి. కొన్ని ఎముకలు ఎండిపోయీ, మరి కొన్ని పచ్చిగానూ ఉన్నాయి. దుర్గంధానికి ముక్కులు పగిలి పోతున్నాయి. అయినా అందరూ తెగడస్సి ఉండడం చేత ఆ సావట్లోనే నడుములు వాల్చి నిద్రపోయారు.

చీకటి పడే వేళకు ఉరుము లాంటి ధ్వని వినిపించేసరికి అందరూ తుళ్ళిపడి మేలుకున్నారు. వారు చూస్తూండగానే పై కప్పు నుంచి ఒక భయంకరాకారుడు లోపలికి దిగాడు. వాడు నల్లగానూ, తాడి ప్రమాణంలోనూ ఉన్నాడు. వాడి కళ్ళు పండునిప్పుల్లాగా ఎర్రగా ఉన్నాయి. వాడి చెవులు భుజాల మీదికి వేళ్ళాడుతున్నాయి. వాడి చేతిగోళ్ళు పులిగోళ్ళలా ఉన్నాయి. వాణ్ణి చూసి అందరూ భయంతో కొయ్యబారిపోయారు.





ఆ రాక్షసుడు గోడవారనే ఉన్న బల్లమీద కూర్చుని మనుషులందరినీ కలయజూశాడు. తరవాత వాడు లేచివచ్చి సింద్‌బాద్‌ను మెడపట్టుకుని, పిల్లిని ఎత్తినట్టు ఎత్తి, అటూ ఇటూ తిప్పి చూశాడు. సింద్‌బాద్ వాడికి నచ్చినట్టు లేదు. అతను అసలే బక్కపలచనివాడు, ప్రయాణంలో మరింత చిక్కాడు. అందుచేత రాక్షసుడు అతన్ని కింద పారేసి, మిగినవాళ్ళను కూడా ఒక రొకర్నే పరీక్షించాడు.

చివరకు ఓడసరంగు వంతు వచ్చింది. అతను అజానుబాహువూ, మంచి కండపుష్టి కలవాడూనూ. అందుచేత ఆ రాక్షసుడు అతన్ని విరిచి చంపి, ఇనపకాడకు గుచ్చి, నిశ్చింతగా కాల్చుకు తినేసి, ఆ బల్లమీదే పడుకుని, గుర్రుపెట్టి నిద్రపోయాడు.

ఇదంతా కళ్ళారా చూసిన మిగతా వాళ్ళకు పై ప్రాణాలు పైనే ఎగిరిపోయినట్టయింది. తెల్లవారి రాక్షసుడు బయటికి వెళ్ళిపోయిన దాకా వాళ్ళు కుక్కిన పేలలాగా ఉండిపోయి, ఆ తరవాత తమ దుస్థితి తలుచుకుని బావురుమని ఏడ్చారు.

వాళ్ళకు ఏం చెయ్యాలో తోచలేదు. అందరూ బయటికి వెళ్ళి, దాక్కునే చోటు కోసం దీవి అంతా గాలించారు. కాని అలాటి చోటేదీ లేదు. కొందరికి రాక్షసుడికి ఆహారం కావటం కన్న సముద్రంలో చావటం మేలనిపించింది. కాని మరి కొందరు, "చావు ఎలాగూ తప్పేటట్టు లేదు గనక, రాక్షసుణ్ణి చంపటానికి ప్రయత్నిద్దాం," అన్నారు.

ఈ ఆలోచన అందరికీ నచ్చింది. రాక్షసుణ్ణి చంపాక ఆ దీవి నుంచి పారిపోవాలంటే సాధనం ఒకటి అవసరం. అందుచేత వారంతా సముద్రతీరాన కొయ్యలతో పెద్ద తెప్ప ఒకటి తయారు చేసి, చీకటి పడే వేళకు భవనానికి తిరిగి వచ్చారు.

మామూలు వేళకు రాక్షసుడు ఇల్లు చేరుకున్నాడు. వాడు మరొక మనిషిని

చంపి, కాల్చుకుని తిని, బల్ల మీద పడు కుని నిశ్చింతగా నిద్రపోయాడు. ఆ సమయంలో చావగా మిగిలినవాళ్ళు రెండు ఇనపకాడల చివరలను నిప్పులో ఎర్రగా కాల్చి, ఒక్కొక్క కాడనూ ముగ్గురు, నలుగురు చొప్పున పట్టుకుని తీసుకుపోయి రాక్షసుడి రెండు కళ్ళలోనూ గుచ్చారు. ఆ బాధకు రాక్షసుడు భవనం కూలిపోయేటంతగా అరిచాడు.

కళ్ళు పోయాయేగాని రాక్షసుడు చావలేదు. మనుషుల కోసం వాడు అంతటా తడివాడు గాని, ప్రయాణీకులు వాడికి అందకుండా తప్పించుకున్నారు. చివరకు వాడు తడువుకుంటూనే బయటికి వెళ్ళిపోయాడు.

వెంటనే మిగిలిన వాళ్ళంతా సముద్ర తీరానికి పరిగెత్తిపోయి, కిందటి రోజు తయారు చేసిన తెప్ప మీద ఎక్కి, దాన్ని సముద్రం మీదికి తోసుకుపోయారు.

కొద్ది సేపటికల్లా వారికి పెద్ద పెడబొబ్బ వినిపించింది. కళ్ళులేని రాక్షసుణ్ణి ఒక ఆడరాక్షసి నడిపించుకుంటూ రావటం వారికి కనిపించింది. ఇద్దరూ కలిసి సముద్రం ఒడ్డుకు వచ్చి తెప్ప మీదికి పెద్ద పెద్ద కొండ రాళ్ళు విసిరారు. వాటిలో కొన్ని గురిగా



తగిలాయి. సింద్‌బాదూ, మరి ఇద్దరూ తప్ప మిగిలిన వారందరూ సముద్రంలో పడిపోయారు. చావగా బతికిన ముగ్గురూ తెప్పను రాళ్ళకు అందకుండా సముద్రం మీదికి తీసుకు పోగలిగారు.

వారా తెప్ప మీద రెండు పగళ్లూ, రెండు రాత్రులూ గాలికి కొట్టుకుపోయి మరొక దీవి చేరుకున్నారు. అప్పటికి వారు చాలా శోషిల్లి ఉన్నారు. వాళ్ళు ఆ దీవిలో సంచరించి, చెట్లపళ్ళు కోసుకు తిని, మంచినీరు తాగే సరికి సూర్యాస్తమయమయింది. ముగ్గురూ ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి, ఆ రాత్రి దాని మీదనే నిద్రపోయారు.




వాళ్ళు తెల్లవారి నిద్రలేచి చూచేసరికి ఒక మహాసర్పం వాళ్ళున్న చెట్టు కేసి వస్తూ కనిపించింది. దాన్ని చూస్తూనే వాళ్ళకు దడపుట్టింది. అది కూడా వారిని చూడగానే, వారున్న ఎత్తుకు తలను లేపి, సింద్‌బాద్ వెంట ఉండిన ఇద్దరిలో ఒకణ్ణి పట్టి మింగేసి తన దారిన తాను వెళ్ళిపోయింది.

తరవాత సింద్‌బాదూ, అతని అనుచరుడూ చెట్టు దిగి, పళ్ళు కోసుకు తిని, నీరుతాగి, రాత్రి గడపటానికి ఇంకా ఎత్తయిన చెట్టు కోసం ద్వీపమంతా వెతికి, దాని మీద ఎక్కి నిద్రపోయారు. కాని మళ్ళీ తెల్లవారే సరికి సర్పం వచ్చి, చెట్టు బోదెకు శరీరం చుట్టి వేస్తూ పైకి ఎక్కి, సింద్‌బాద్ వెంట ఉన్న ఒక్కణ్ణీ కూడా కబళించి వెళ్ళిపోయింది.

సింద్‌బాద్‌కు పుట్టిన దడ ఇంతా అంతా కాదు. అతను ఒంటరిగా మిగిలిపోయాడు. ఎంతో శ్రమపడి రాక్షసుడి బారి నుంచి తప్పించుకుంటే, మృత్యువు ఈ పాము రూపంలో మళ్ళీ ప్రత్యక్షమయింది. సర్పానికి ఆహారం అయేకన్న సముద్రంలో పడి ఆత్మహత్య చేసుకోవటం మేలనుకుని అతను దీవికి అడ్డంపడి సముద్ర తీరానికి పరిగెత్తాడు.

కాని తీరా అక్కడికి వెళ్ళేసరికి అతనికి చావు తప్పించుకునే ఉపాయం తోచింది. సముద్రం ఒడ్డున అనేక చెక్కలు పడి ఉన్నాయి. అతను ఆ కలప నంతా ఏరి తెచ్చి, నాలుగు పెద్ద చెక్కలు తనకు నాలుగు వైపులా పాతి, వాటి మధ్యన ఆ రాత్రి పడుకుని, తన పైన మరికొన్ని చెక్కలు పేర్చుకున్నాడు. ఈ ఎత్తు పారింది. మామూలువేళకు పాము వచ్చింది; అతన్ని చెక్కల సందు నుంచి బయటికి లాగాలని ఎన్నో విధాల ప్రయత్నించింది, సాధ్యంకాక వెళ్ళిపోయింది.





సర్పం వెళ్లిపోయినట్టు రూఢి అయినాక సింద్‌బాద్ చెక్కలను తోసేసి బయటికి వచ్చి, సముద్రతీరాన నిలబడి చూశాడు. దూరంగా ప్రయాణం చేస్తూ ఒక ఓడ కనిపించింది. అతను వెర్రిగా కేకలు పెట్టాడు; చేతులాడించాడు; ఒక చెట్టు కొమ్మకు తన తలపాగా కట్టి, గాలిలో ఆడించాడు. ఎలా గయితేనేం ఓడలో వాళ్ల దృష్టిని అతను ఆకర్షించగలిగాడు. ఓడవాళ్ళు మార్గం తప్పించి, ఓడను రేవుకు తెచ్చి, లంగరు దించి, సింద్‌బాద్‌ను ఎక్కించుకున్నారు.

అతను ఓడవాళ్లిచ్చిన మంచి దుస్తులు ధరించి, వాళ్ళు పెట్టిన భోజనం కడుపు నిండా తిని, బడలిక తీరేటట్టు సుఖంగా నిద్రపోయాడు. మృత్యుదేవత కళ్ళలోకి చూసిన కారణంగా అంతరించి పోయిన జీవచైతన్యం క్రమంగా తిరిగి కోలుకో సాగింది. గడిచిపోయిన కష్టాలు పీడకల లాగా తోచసాగాయి.

ప్రయాణం సుఖంగానే సాగింది. ఓడ సలాహితా అనే ద్వీపం చేరింది. ఓడలోని వర్తకులు క్రయవిక్రయాలు చెయ్యటానికి ద్వీపం మీదికి వెళ్ళారు. నిర్భాగ్యుడుగా ఓడ మీద నిలిచిపోయిన సింద్‌బాద్ దగ్గిరికి సరంగు వచ్చి, "చూడు, నాయనా! నువు నిర్ధనుడివి, దిక్కులేని వాడివి. చాలా కష్టాలు పడి ఉన్నట్టు చెప్పావు. నా దగ్గిర కొంత సరుకు అనామతుగా ఉన్నది. అవి మా ప్రయాణాలలో ఒక దీవి మీద దిగబడి పోయిన వర్తకుడిది. ఆ సరుకును తీసుకు పోయి అమ్మి డబ్బు తీసుకురా. ఆ డబ్బులో లాభం వంతు నువు ఉంచుకుని, మిగతాది నా కిచ్చెయ్యి. నేను దాన్ని ఆ వర్తకుడి బంధువులకు చేర్చుతాను," అన్నాడు.

సింద్‌బాద్ ఇందుకు సంతోషంగా ఒప్పుకున్నాడు.

సరంగు ఒక గుమాస్తాను పిలిచి, "నావికుడు సింద్‌బాద్ పేళ్ళన్నీ చిట్టాలో రాసి



ఈ మనిషి పరం చెయ్యి. ఇతని పేరేమిటో అడిగి రాసుకో," అన్నాడు.

సింద్‌బాద్ ఉద్రేకంతో, "నేనే నావికుడు సింద్‌బాద్‌ను!" అని గట్టిగా అరిచాడు.

అతను ఈసారి సరంగు కేసి పరీక్షగా చూసి, తన రెండవ యాత్రలో ఎక్కిన ఓడ సరంగు ఈ మనిషేనని గుర్తించాడు. ఇతనే తనని ఒక దీవిలో వదిలేసి ఓడను నడుపుకు వెళ్ళిపోయాడు.

సింద్‌బాద్ సరంగుతో తన రెండవ యాత్రలో గండభేరుండపక్షి సహాయంతో రత్నాల లోయలోకి వెళ్ళి, తిరిగి ప్రాణాలతో బయటపడిన అద్భుత సంఘటనలు చెబుతూండగా, సరుకు అమ్మి ఓడకు తిరిగి వచ్చిన ఒక వర్తకుడు సింద్‌బాద్ కేసి పరీక్షగా చూసి, "అరే, అల్లా! నా మాట ఎవరూ నమ్మలేదు. గండభేరుండపక్షి రత్నాల లోయలో నుంచి మనిషిని పైకి తీసుకు రావటం కళ్ళారా చూశానంటే, అన్నీ అబద్ధా లన్నారు. ఇడుగో ఆ మనిషి— నాకు వెలలేని రత్నా లిచ్చిన పుణ్యాత్ముడు!" అంటూ సింద్‌బాద్‌ను ఆలింగనం చేసుకున్నాడు.

సరంగు అనుమానాలన్నీ తీరిపోయాయి. అతను సింద్‌బాద్ చేతులు రెండూ పట్టుకుని, ప్రాణాలతో బయట పడినందుకు అతన్ని ఎంతగానో అభినందించాడు. తరవాత సింద్‌బాద్ తన సరుకులను విక్రయించి చాలా లాభం చేసుకున్నాడు.

ఓడ సలాహితా నుంచి సింధుదేశం వెళ్ళింది. అక్కడి సముద్రంలో ఆవుముట్టే, గాడిదముట్టే గల చేపలూ, ఎగిరే చేపలూ సింద్‌బాద్ చూశాడు. ప్రయాణం చాలా కాలం సాగినాక ఓడ బస్రా చేరింది. సింద్‌బాద్ బస్రా నుంచి బాగ్దాద్ చేరుకుని, తన వారినందరినీ కలుసుకుని, పేదసాదలకు దానధర్మాలు చేసి, తిరిగి సుఖజీవనం గడపసాగాడు.





# గాంధీ కథ

## 11

1913 సెప్టెంబరులో దక్షిణాఫ్రికాలో గాంధీ సాగించిన సత్యాగ్రహోద్యమం అరితేరిన రాజకీయవాదులకు హాస్యాస్పదంగా ఉంటుంది. సత్యాగ్రహుల సంఖ్య 16 కు తక్కువా 66 కు ఎక్కువా కాకుండా ఉన్నది. ఆయన మొట్టమొదటగా సత్యాగ్రహులను నేటాలు నుంచి పర్మిట్లు లేకుండా ట్రాన్స్‌వాల్‌లోకి పంపాడు. వారిని అధికారులు అరెస్టు చేసి ఖైదులో ఉంచారు. తరవాత 11 మంది స్త్రీలు ట్రాన్స్‌వాల్ సరిహద్దు దాటి నేటాలు రాష్ట్రం ప్రవేశించి, బొగ్గుగనులకు ప్రసిద్ధి చెందిన న్యూకేసిల్‌కు బయలుదేరారు. వారు గనులలో పనులు చేసే భారతీయుల చేత సమ్మె కూడా చేయించారు. సమ్మెదార్లు అఘాయిత్యాలు చేస్తారేమోనని గాంధీ న్యూకేసిల్‌కు వెళ్ళాడు. గనియజమానులు తీవ్రచర్యలు తీసుకుంటారని పనివాళ్ళు బెదరలేదు. తమకు "గాంధీభాయి" లో పూర్తి విశ్వాసం ఉందన్నారు.

అయితే గనియజమానులు పనివారి ఇళ్ళకు నీరూ, కరెంటూ రాకుండా బిగించటంతో గాంధీ వారందరినీ ట్రాన్స్‌వాల్‌కు బయలుదేరదీశాడు. "యాత్రికులు" 2,037 మగవాళ్ళూ, 127 స్త్రీలూ, 57 పిల్లలూనూ. వారందరూ జొహాన్స్‌బర్గ్ చేరే లోపల గాంధీని మూడుసార్లు అరెస్టు చేసి, చివరసారి ఖైదు చేశారు. తరవాత సమ్మెదార్లను కూడా అరెస్టు చేసి, నేటాల్‌కు రైలులో తీసుకుపోయి, అక్కడ అందరినీ ఖైదు చేశారు.

దక్షిణాఫ్రికా ప్రభుత్వం అతి క్రూరమైన చర్యలతో భారతీయులను అణగదొక్కాలని చూసింది. భారతదేశంలో సంచలనం



బయలుదేరింది. ఇండియాలోని బ్రిటిషు వైస్రాయి కూడా ఆక్షేపణ తెలిపాడు. చివరకు దక్షిణాఫ్రికా ప్రభుత్వం తన భారతీయ వ్యతిరేక విధానాన్ని కొంత సడలించక తప్పలేదు. 3 పౌనుల పన్ను పోయింది. భారతీయుల వివాహాలు గుర్తించబడ్డాయి. సత్యాగ్రహోద్యమం నిలిచిపోయింది. జైలులో ఉండగా తాను తయారు చేసిన చెప్పుల జతను గాంధీ జనరల్ స్మట్స్‌కు బహూకరించాడు! 1914 లో గాంధీ దక్షిణాఫ్రికా నుంచి వచ్చేసినాక అక్కడి భారతీయులకు నాయకత్వం వహించే నాథుడు లేకపోయాడు.

1915 జనవరి 9 న గాంధీ బొంబాయి రేవులో ఓడ దిగినప్పు డాయనకు మహా వీరుడికి లాగా స్వాగతం లభించింది. మూడు రోజుల అనంతరం బ్రహ్మాండమైన సన్మాన సభ కూడా జరిగింది. ప్రభుత్వం ఆయనకు కేసరీహింద్ పతకాన్ని బహూకరించి గౌరవించింది.

భారతదేశానికి వస్తూనే గాంధీ రాజకీయ రంగంలోకి దిగలేదు. ఆయన పోర్బందర్, రాజకోటలకు వెళ్ళి తరవాత రవీంద్రనాథ టాగూరుగారి శాంతినికేతనానికి వెళ్ళాడు. ఆయన అక్కడ ఒకవారం ఉన్నాడు. అంతలోనే గోఖలే మరణించినట్టు తంతి వచ్చింది. గోఖలే గాంధీని ఒక సంవత్సరం పాటు రాజకీయ రంగానికి దూరంగా ఉండమని కోరి ఉన్నాడు.

గాంధీ తన వెంట దక్షిణాఫ్రికా నుంచి వచ్చేసిన బంధుమిత్రుల కోసం సబర్మతీ ఆశ్రమాన్ని ఏర్పాటు చేశాడు. ఇది అహమ్మదాబాదుకు సమీపంలో ఉన్న 150 ఎకరాల ప్రదేశం. ఈ ఆశ్రమంలో ఆదిలోనే సంఘర్షణ బయలుదేరింది. ఆశ్రమంలో అస్పృశ్యులను గాంధీ ఉండనిచ్చాడు. ఇది తీవ్రమైన ఆక్షేపణలకు కారణమయింది. ఈ ఆశ్రమం గాంధీజీ సిద్ధాంతాలకు ప్రయోగ

శాలగానూ, సత్యాగ్రహులకు శిక్షణా శిబిరం గానూ పని చేసింది.

1919 లో రౌలట్ చట్టం అమలులోకి వచ్చేదాకా గాంధీ జాతీయ రాజకీయ రంగంలో ప్రముఖపాత్ర వహించలేదు. అంతదాకా ఆయన చంపారన్‌లోనూ, గుజరాతులోనూ వ్యవసాయ కార్మికుల పోరాటాలలోనూ, అహమ్మదాబాదులో పారిశ్రామిక కార్మికుల పోరాటాలలోనూ మాత్రమే జోక్యం కలిగించుకున్నాడు. కాంగ్రెసు జాతీయోద్యమం అప్పటికే చాలాకాలంగా ఉన్నది గాని దానికి నాయకులు తిలక్, గోఖలే, లజ్పత్‌రాయ్ మొదలైనవారు. రౌలట్ చట్టం ప్రజా వ్యతిరేకమైనది. చేయని నేరాలకు, చేస్తారనే అనుమానం మీద ప్రభుత్వం ఎవరినైనా ఖైదు చేయవచ్చును. ఈ చట్టాన్ని చిన్న పెద్ద నాయకులందరూ వ్యతిరేకించినా ప్రభుత్వం వినిపించుకోలేదు. గాంధీ సత్యాగ్రహోద్యమం నడపటానికి మంచి అవకాశం కనిపించింది.

వెంటనే గాంధీ సత్యాగ్రహ సభ అనేది ఒకటి వ్యవస్థాపించి, దేశపర్యటన చేస్తూ ఉపన్యాసాలిచ్చాడు. ఏప్రిల్ 6 న హర్తాల్ జరగాలని నిర్ణయించాడు. అయితే బొంబాయి, అహమ్మదాబాదు లాటి కొన్ని



చోట్ల ప్రజలు హింసాచర్యలు చెయ్యటం వల్ల ఆయన సత్యాగ్రహం రద్దు చేసి, మూడు రోజుల ఉపవాసంతో తనను తాను క్షాళనం చేసుకున్నాడు. క్షాళనం దేనికంటే ప్రజలలో ఇంకా హింసాతత్వం ఉన్నదని తాను గుర్తించనందుకు!

పంజాబులోని అమృతసరంలో ఏప్రిల్ 10 న ప్రజలు పేట్రేగిపోయి తెల్లవాళ్ళపైన చెయ్యి చేసుకున్నారు, భవనాలు తగలబెట్టారు, టెలిగ్రాఫ్ తీగలు తెంపారు. బ్రిగేడియర్ డయ్యార్ అనేవాడు సేనను నగరంలోకి తెచ్చాకనే శాంతి నెలకొన్నది. ఈ డయ్యారే మరి రెండు రోజుల అనంతరం

వైశాఖ పూర్ణిమనాడు జలియన్ వాలాబాగ్‌లో చేరిన జనం మీద కాల్పులు జరిపి భీభత్స హింసాకాండ కొనసాగించాడు. 400 మంది నిరాయుధులు చచ్చారు, 1200 మంది గాయపడ్డారు.

అటు తరవాత భారతీయులకూ, బ్రిటిషు వారికీ ఏర్పడిన రాజకీయ వైరం తిన్నగా స్వాతంత్ర్యానికి దారి తీసింది. అంతదాకా బ్రిటిషువారిలో విశ్వాసం ఉంచిన గాంధీకి కూడా వారి "సంస్కారం" లో విశ్వాసం పోయింది.

గాంధీ ప్రారంభించ దలచిన సత్యాగ్రహంలో ముఖ్యాంశం విదేశీ కోర్టులనూ, స్కూళ్ళనూ, శాసనసభలనూ, వస్త్రాలనూ బహిష్కరించటం. ఇదే బ్రిటిషు వారికి సహాయ నిరాకరణం. ఈ సహాయ నిరాకరణాన్ని తగినట్టుగా ప్రజలు అమలు జరిపితే ఒక్క ఏడాదిలో స్వరాజ్యం వస్తుందని గాంధీ, 1920 లో జరిగిన కలకత్తా కాంగ్రెసు సమావేశంలో అన్నాడు. కాంగ్రెసులో అధిక సంఖ్యాకులు గాంధీ ఉద్యమాన్ని అమోదించారు.

దేశ ప్రజలు గాంధీ చేసిన ప్రచారంతోనూ ఆయన ఆదర్శాలతోనూ తృప్తి పడ్డారు. గాంధీ మహాత్ముడన్న బిరుదు సంపాదించటానికి అదే మొదలు. అటు తరవాత ఈ దేశంలోనూ, ప్రపంచమంతటా కూడా "మహాత్మా" అంటే గాంధీయే.

1921 లో భారతదేశం మేలుకున్నదని చెప్పాలి. గాంధీ ఉద్యమం వెనక హిందువులేగాక ముస్లిములు కూడా ఉన్నారు. 1921 ఆఖరులోనూ, 1922 ఆరంభంలోనూ 30,000 మంది జైళ్ళకు వెళ్లారు; జైళ్ళకు శ్రీకృష్ణజన్మస్థానం అనే ముద్దు పేరు వచ్చింది.

సభలూ, ఊరేగింపులూ పూర్తిగా నిషేధించ బడ్డాయి. ఖిలాఫత్, కాంగ్రెసు కార్యాలయాల సోదా జరిగింది.



# 98. "వెయ్యిదీవులు"

అమెరికా కెనడాదేశాల సరిహద్దున గల అంటారియో సరస్సు నుంచి సెంట్ లారెన్స్‌నది వెలువడే చోట అనేకమైన దీవులున్నాయి. చాలాకాలం క్రితం ఒక ఫ్రెంచి అన్వేషకుడు వీటిని చూసి, "వెయ్యి దీవులు!" అని ఆశ్చర్యపోయాడట. నిజానికి ఈ దీవుల సంఖ్య దాదాపు **1700** దాకా ఉన్నది.

ఇది ఒకప్పుడు ఎర్రఇండియనుల కిందవున్న భాగం. ఇక్కడ ఫ్రెంచివారూ, ఇంగ్లీషువారూ, ఇండియనులూ యుద్ధాలు జరుపుతూ "దాగుడుమూతలు" ఆడారు. ఇండియనులు ఈ ప్రదేశాన్ని "మనిటొన్నా" అనేవారు. "మహాశక్తి ఉద్యానం" అని ఆ మాటకు అర్థం.

**19** వ శతాబ్ది ముగియక పూర్వమే అమెరికనులు అనేక దీవులు కొనుక్కొని, వేసవి భవనాలు కట్టుకున్నారు. అందువల్ల దీనికి విశ్రాంతి కేంద్రంగా గొప్ప ఖ్యాతి వచ్చింది. ఇది చాలా అందమైన స్థలం కావటాన వినోదం కోసం అసంఖ్యాకంగా జనం వస్తారు; పడవషికార్లు చేస్తారు.

ఈ ద్వీప సముదాయం నిడివి **40** మైళ్ళు. **1938** లో వీటి మీదుగా వంతెన కట్టారు.



Photo by Gautam Khata



బహుమతి
పొందిన వ్యాఖ్య

కనిపెట్టటం నా వంతు

పంపినవారు :
వి. మీరాదేవి, విజయవాడ

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

కట్టిపెట్టటం నీ వంతు

పంపినవారు:
వి. మీరాదేవి, విజయవాడ

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 మార్చి నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జనవరి నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఏంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కనిపెట్టటం నా వంతు

రెండవ ఫోటో: కట్టిపెట్టటం నీ వంతు

పంపినవారు: వి. మీరాదేవి,

దుర్గాపురం, విజయవాడ-3

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

**Printed by B V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3. Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

# భరింపరాని తలనొప్పి నిమిషాలలో పోయింది!



# అమృతాంజనం

## ప్రభావం వల్లన్!

తలనొప్పి, జలుబులు, బెణుకులు కండరాలనొప్పి— వీటిని చప్పున చల్లగా తగ్గించుకోండి. బాధగా ఉన్న చోటు మీద అమృతాంజనం రాయండి. వెంటనే గుణం ఇస్తుంది. 75 సంవత్సరాలపైగా ఇంటింటి దీపమై వెలుగుతోంది అమృతాంజనం! ఎప్పుడూ ఒక సీసా దగ్గిర ఉంచుకోండి. అమృతాంజనం ఆదాచేసే పెద్ద సీసాలలోనూ, చిన్న డబ్బాలలోనూకూడా దొరుకుతోంది.




అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది.

నొప్పులను, జలుబులను చప్పున, చల్లగా తగ్గిస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్:
మదరాసు - బొంబాయి - కలకత్తా - న్యూ ఢిల్లీ - హైదరాబాదు - బెంగళూరు

AM-5339

శుభోదయమ్ముతో
విశిష్ట జీవితము
పనిపాటలతో అవశ్య భోగ్యము
రుచిసంపద అపూర్వమది
ఘుమఘుమల గుబాళింపు
A-1 డస్ట్‌ను వాడండి
డబ్బులు ఆదా చేస్తుంది!




# బ్రూక్ బాండ్ A-1 డస్ట్
# ప్యాకెట్టుకు హెచ్చు కప్పుల మంచి టీ

BB 5379




మాధుర్య జీవితానికి క్యాడ్‌బరిస్!

Cadbury's

విశిష్టమైన మరియు మిగత మిల్క్ చాక్‌లెట్ అంటే క్యాడ్‌బరిస్...
ఇది ఆనందాన్ని కలుగజేస్తుంది. ఆరు విధములయిన
రుచులతో కూడిన ఆనందాన్ని మీరు
క్యాడ్‌బరిస్‌తో పొందగలుగుతారు.



ప్రతి చాక్‌లెట్ పాలయొక్క



గుణములు గలిగినది!

LPE-AIYARS-C2 TL

